# ఒకే జాతిగా రూపొందడమెలా?







రచన:
జి. వి. యల్. నరసింహారావు





నవభారతి ప్రచురణలు

ప్రథమ ముద్రణ :
జూన్ 22, 1987

ప్రచురణ :
**నవభారతి ప్రచురణలు**
3-4-705/4,
నారాయణగూడ,
హైదరాబాద్-500 029.



ప్రతులకు :
**సాహిత్య నికేతన్**
3-4-852,
బర్కత్‌పురా,
హైదరాబాద్-500 027.



**సాహిత్య నికేతన్**
ఏలూరు రోడ్డు,
విజయవాడ-520 002.

ముద్రణ :
**పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్**
హైదర్‌గూడ,
హైదరాబాద్-500 029.

**మూల్యం : రూ. 5-00**

# ముందుమాట

మనం రాజకీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించుకుని నలభై సంవత్సరాలు పూర్తి అవుతున్నాయి. అయినా దేశంలో జాతీయతాభావాన్ని పెంపొందించలేకపోయాం. దానికి ముఖ్యకారణం మనకే స్పష్టమైన కల్పన లేకపోవటం. జాతీయత అంటే ఏమిటి? అది ఎలా ఏర్పడుతుంది? మొదలైన ప్రశ్నలకు సమాధానాలు స్పష్టంగా విద్యాధికులకే తెలియకపోవటం.

అలాగే హిందు అనేపదం మతాన్ని సూచించదు. అది ఈ దేశంతో అనాది కాలంనుండి నివసిస్తున్న ప్రజల్ని సూచిస్తుంది. కాలానుగతంగా సంతరించుకున్న రాజకీయ, సామాజిక, సాంస్కృతిక, ధార్మిక భావనలు ఆధారంగా ఏర్పరచుకున్న ఏకాత్మభావంతో, సామాన్య జీవన విధానం మౌలిక విలువలు కలిగిన ఓ జాతిని ఆ పదం సూచిస్తుంది. భిన్నత్వం బయటకు కనిపిస్తున్నా ఏకత్వం ఓ సూత్రంలా అందరినీ కట్టి ఉంచుతుంది. ఆ విధంగా మన ప్రజలు సంఘటిత భావంతో రూపొందటానికి పూర్వం అనేక రకాలుగా ప్రయత్నాలు జరిగేవి. మరి ఈనాడు? ప్రజలలోని భిన్నత్వాన్ని మరింత పెంచటానికి విచ్ఛిన్నకర శక్తులు ప్రయత్నం చేస్తున్నాయి.

ఈ విషయాల నన్నింటినీ విపులీకరించారు శ్రీ జి. వి. యల్. నరసింహారావు, 'ఒకే జాతిగా రూపొందడమెలా' అనే పేరుతో యిది వరలో వారు వ్రాసి ప్రచురించిన పుస్తకాన్ని మరింత వివరంగా తిరిగి వ్రాసి ప్రచురణకు అనుమతి నిచ్చిన శ్రీ నరసింహారావుకు మా కృతజ్ఞతా పూర్వక నమస్కారాలు.

ప్రభవ జ్యేష్ఠ అచలా ఏకాదశి
జూన్ 22, 1987
హైదరాబాదు

ప్రకాశకులు

# తొలిపలుకు

ఇంగ్లీషులో (1) "నేషన్" (Nation) అనీ (2) "రేస్" (race) అనీ, రెండు పదాలున్నాయి. వీటికి సరైన తెలుగు లేదా సంస్కృత పదాలు (1) "రాష్ట్రం" (2) "జాతి". అయితే వాడుకలో తెలుగు ప్రజ "జాతి" అన్నమాటనే రాష్ట్రం (Nation) అనే అర్థంలో ఉపయోగిస్తారు. నేనూ అంతే చేశాను.

రాష్ట్రం (Nation) కి అఖండంగా గౌరవించే నిర్ధారితమైన యెల్లలుగల ఒక భూమి తప్పక ఉండాలి. ఈ భూమినే మాతృభూమిగా, పితృభూమిగా, కర్మభూమిగా, ధర్మభూమిగా, పుణ్యభూమిగా భావిస్తూ, అవిచ్ఛిన్నంగా అందులో నివసించే ప్రజలుండాలి. ఈ ఒకే సమాజపు వ్యక్తులు క్రమంగా సంతరించుకున్న రాజకీయ, సామాజిక, సాంస్కృతిక, ఆధ్యాత్మిక (అంటే మతానికి అతీతంగా వ్యక్తికి, తనచుట్టూగల కుటుంబం, సమాజం, దానిలోని వివిధ వ్యక్తులు, వర్గాలు, సంఘాలు, జానపదం, రాజ్యం ఇత్యాదులతో తన సంబంధాలను ఘనతరంచేసి ఒకటిగా వుంచడానికి కావల్సిన యేకాత్మ భావనను కల్గించే ధర్మం) సంపత్తితో వారు ఒక జీవన విధానాన్ని, మౌలిక విలువలను యేర్పరచుకుంటారు. అంటే వారు రాష్ట్రానికి (Nation) కావాల్సిన కనీస అర్హతలు పొందుతారు. ప్రాథమిక ఆవశ్యకతలు కల్గినవారైతారు.

ఈ ప్రాథమికావస్థనుండి బైటపడి చక్కగా వికసించిన జాతికి——

# ఒకే

ఆశా ఆకాంక్షలు
ఆశయాదర్శాలు
భావాలు, అనుభవాలు
సంస్కృతీ, సమాజము
వీరులు, వారసత్వం
చరిత్ర, నాగరికత
నిష్ఠాప్రతిష్ఠలు
మర్యాదా, మానబిందువులు
జీవనపద్ధతి, జీవనతత్త్వం
శత్రుమిత్రతత్వ భావనలు
పూర్వులు, ప్రతిక్రియాత్మక భావనలు
పరంపరానుగత ఆచార వ్యవహారాలు
నీతి, రీతులు
పండుగలు, పర్వాలు
వాఙ్మయ, ఇతిహాసాలు
గౌరవ చిహ్నాలు, శ్రద్ధాకేంద్రాలు
ధ్యేయం,
పరంపర, ప్రయోజనాలు
సాంప్రదాయాలు, శ్రద్ధాభక్తులు
మర్యాదా మమతల్లు

# అన్నింటికన్న మిన్నగా

దేశీయ, విదేశీయ, జాతీయ, అంతర్జాతీయ సంఘటనలపట్లా, చరిత్ర లోని ఘటనలపట్లా, వ్యక్తులపట్లా ఒకే రకమైన హృదయ స్పందన - అనుకంపన - వుంటాయి.

ఇలా వికసించిన జాతి అనే పుష్పానికి స్వాతంత్రం అనేది సువాసన.

స్వాతంత్రంతో స్వదేశం (స్వదేశీ) స్వభాష (లు) స్వరాజ్యం, స్వధర్మం అనేవి పెనవేసుకు ముడివేసుకున్నాయి.

ఇంగ్లీషు వారి పాలనవల్ల మనలో కొన్ని వుండకూడని భావా లేర్పడ్డాయి. మనం యెక్కడినుంచో వచ్చినవాళ్ళం, ఈ దేశస్థులం కాదు అనేవి అందులో ముఖ్యమైనది. ఇది అబద్ధం. ఒకవేళ నిజమేనేమో అనుకునే వాళ్ళు ఎవరైనా వుంటే మనకి ఈ దేశంతప్ప వేరే దేశం అనేది ఏదీ లేనంతగా పరిస్థితి యేర్పడేటట్లుగా యిక్కడి గడ్డతో ముడిపడి దీన్ని స్వంతం చేసుకున్నాం!

మహమ్మదీయుల్లోను, క్రైస్తవుల్లోనూగూడా ఒక భావం పోవాలి. తాము యిక్కడ విజేతలం అని - అంటే ఇక్కడికి ఈ దేశాన్ని జయించి పరిపాలించడానికి వచ్చిన విదేశీ ముసల్మాను, క్రైస్తవరాజుల వారసులు మనే భావన పోవాలి. ఆ ఇతర దేశాలనుండి వచ్చిన ముస్లింలు, క్రైస్తవులు కారు వీరు. ఇక్కడి సమాజంలో నాటి పరిస్థితులలో అనేక కారణాలవల్ల ఇస్లాం, క్రైస్తవ మతం పుచ్చుకున్న మన పూర్వుల సంతతి వీరు. ఒక

మహనీయుడు 'రాజకీయదాస్యంతోపాటు మనకు ఆర్థికదాస్యం వచ్చింది. వాటితోపాటుగా కొందరికి మతదాస్యంకూడా వచ్చింది. రాజకీయ స్వతంత్రం మనకు వచ్చింది. ఆర్థిక స్వాతంత్ర్యం కోసం కృషి చేస్తున్నాం. వీళ్ళు ఈ మతదాస్యంనుండి బైటపడాలని నేను కోరుతున్నాను' అని అన్నదాంట్లో సూక్ష్మంగా ఆలోచిస్తే నిజంలేదూ? ఆ విదేశీ పాలకుల వారసులం అనే భావన లేకుంటే ఈనాడు ఏ ముస్లిం లేదా క్రైస్తవుడు ఆ విదేశీ దురాక్రమణదారులు ఏ ఏ పనులు చేశారో ఆ యా పనులను- అంటే ఈ జాతిని అవమానించడానికి ఆ యా 'మతా'లతో సంబంధం లేనట్టి గోహత్య వంటి వాటిని యెందుకు చేస్తున్నారు? శబరిమలై వంటి ప్రఖ్యాత దేవాలయాలు స్వతంత్రం వచ్చాకకూడా యెందుకు విధ్వంస మవుతున్నాయి? దేవాలయాల్లోని దేవతల విగ్రహాలెందుకు మాయమవు తున్నాయి? కన్యాకుమారిలో స్వామి వివేకానంద ఆలయానికి వేసిన పునాది రాయి నెందుకు బ్రద్దలుకొట్టారు? న్యాయస్థానాల తీర్పులను వ్యతిరేకిస్తూ కూడా మేళతాళాలతో (అవి వాయించకుండా వున్నా) గల ఊరేగింపులపై మసీదులముందు దాడులెందుకు యింకా జరుగుతున్నాయి? స్త్రీలపై కూడ అత్యాచారాలెందుకు జరుగుతున్నాయి? నిర్మొహమాటంగా చెప్పాల్సి వస్తే ఈ దేశంమీదకు విదేశీ దురాక్రమణపరులుగా వచ్చినవారిలాగా ఇక్కడి ముస్లిం, క్రైస్తవ సోదరులు ఆలోచించడంవల్లనే. ఈ జన్మ భూమిని 'భోగభూమి'గా భావించడంవల్లనే ఇవి జరుగుతున్నాయి.

ఇటీవల మహమ్మదు ప్రవక్త కేశం (వెంట్రుక) దొంగిలించ బడింది. ఇది ముస్లింలకు పవిత్రమైనది. అప్పుడు సాటి క్రైస్తవ, హిందూ ప్రజలుకూడా ముస్లింలతోపాటు కలసి ఈ అత్యాచారాన్ని ఖండించారు. ఒకే భావాలు వెలిబుచ్చడం వల్లనే నాడు మతసామరస్యం రక్షించబడింది. అలా హిందువులపై జరిగే అత్యాచారాలన్ను, కనీసం పాకిస్తాన్‌లో

హిందువులపై జరిగే అత్యాచారాలను ఇప్పటి ముస్లిం నాయకులు, సంస్థలు సమ్మేళనాలు ఎందుకు ఖండించడం లేదూ? పాకిస్తాన్ వీరి ఓట్ల పాప ఫలితం కదూ? ఈ పాపాలకు నిజమైన పశ్చాత్తాపం అవసరం.

బ్రహ్మంగారి శిష్యులు ముస్లింలలో వున్నారు. తాళింఖానాల్లో ముస్లింలు బలానికి చిహ్నమైన ఆంజనేయునికి మ్రొక్కుతూ వుంటారు. అలాగే ఉరుసుల్లో హిందువులు పాల్గొంటూ వుంటారు. మస్తాన్‌రావు వంటి పేర్లు హిందువులు పెట్టుకుంటున్నారు. ఇది సవ్యమైన పంథాయే.

కాని అందరు ముస్లింలు, క్రైస్తవులు ఇలా యెందుకు ప్రవర్తించరు? 'మతం'తో సంబంధం లేని సంక్రాంతి, హోలి, దీపావళి వంటి ఉత్సవాల్లో యెందుకు పాల్గొనరు? హోలీలో ఎర్రరంగు నీటి చుక్కలు తమ బట్టలపై పడ్డదని మతకల్లోలాలెందుకు చెలరేగుతున్నాయి?

నా పేరు నరసింహారావు, మా నాన్న పేరు కృష్ణారావు, మా ఇంటి పేరు గోవిందరాజు. రేపటి నుండి నేను 'అల్లాయే దేవుడు, మహమ్మద్ అతని ప్రవక్త' అని మనఃపూర్తిగా నమ్మి ఇస్లాం పుచ్చుకుంటాననుకోండి. నా పేరు, యింటి పేరు ఎందుకు మార్చుకోవాలి? ఇస్మాయిల్ అనో రహిమాన్ అనో నన్ను పిల్చుకోకపోతే అల్లా నేను ముస్లింను కాదు పొమ్మం టాడా? మా అబ్బాయికి గర్వంగా మా నాన్న పేరు కృష్ణారావు అనో మా తాత పేరు శ్రీనివాసరావు అనో పెట్టి పిల్చుకుంటే దోషమేమిటి?

నా భార్య రేపటి నుండి క్రీస్తు దేవుని కుమారుడు అని నమ్మి క్రైస్తవ మతం పుచ్చుకుంటే సత్యవతి అనే పేరు ఎందుకు మార్చుకో వాలి? అలవాటుగా బొట్టు వుంచుకుంటే పాపమా? మా అమ్మాయికి షేరీ అనే పేరు పెట్టకుండా మా అమ్మ పేరు కనుక రాజ్యలక్ష్మి అని పెడితే

"మా అమ్మ మేరీ పేరు పెట్టకుండా మీ అమ్మ పేరు పెట్టావు కనుక నిన్ను క్రైస్తవునిగా ఒప్పుకోను" అని క్రైస్తు పేచీ పెడతాడా?

ముస్లింలు, క్రైస్తవులు ఇలా యెందుకు చేయరు? చాంగ్ కై షేక్, మావ్‌సెటుంగ్‌లు ఏ మతస్థులో పేరునుబట్టి చెప్పలేము. ఒకటి చెప్పవచ్చు. ఇద్దరూ చైనావాళ్ళు. ఆ పేర్లు చైనా పేర్లు అయితే, చాంగ్ కై షేక్ క్రైస్తవుడు, మావ్ సేటుంగ్ ముస్లిం!

ముస్లింలు, క్రైస్తవులు తాము ఈ దేశంలో అనాదిగా నివసిస్తున్న హిందువుల సంతానం అని గుర్తించాలి. ఇక్కడ జైన, బౌద్ధ, సిక్కు, వైష్ణవ, శైవ శాక్తేయాది మతాల ననుసరించే హిందువులంతా వారి సోదరులే. కొందరు హిందువులు సిక్కులుగా, బౌద్ధులుగా, జైనులుగా మారిన ఫలితంగా వారి సంతతి ఆ మతస్థులుగా యేర్పడినట్లే, మరికొందరు హిందువులు ముస్లింలుగా, క్రైస్తవులుగా మారితే వారి సంతతి ఆ మతస్తులుగా వుంటూ వచ్చారు. సిక్కులు, బౌద్ధులు, జైనులు, ఎలా హిందువులో అలాగే ముస్లింలు, క్రైస్తవులు కూడా హిందువులే. ఒక్కసారిగా హిందువులమని పిల్చుకోవడం ముస్లింలకు, క్రైస్తవులకు ఈ పరిస్థితిలో అసంగతంగా కన్పించవచ్చు. కనుక తమను హైందవ ముస్లింలు, హైందవ క్రిష్టియన్లు అని మొదటి మెట్టుగా అనుకోవడం ప్రారంభించవచ్చు.

అలాటి భావన యేర్పడిన నాడు ఆక్రమణకారులుగా వచ్చినట్టి ఆ ప్రవృత్తిగలట్టి ముస్లింలు చరిత్రలో గావించిన అకృత్యాలను నేటి ముస్లింలు, క్రైస్తవులు హృదయపూర్తిగా నిరసిస్తారు. విజయనగర శిధిలాలను చూసి, ముస్లిం రాజులు వికృతపరచిన మన శిల్పసంపదను చూసి బాధతో ద్రవిస్తారు.

స్వతంత్రం తర్వాత మన కేంద్ర ప్రభుత్వం చేపట్టిన "సోమనాథ దేవాలయ" పునరుద్ధరణ కార్యక్రమాన్ని జాతీయ కళంకాన్ని తుడిచివేయ డానికి, జాతీయ భావాలను రేకెత్తించడానికి సర్దార్ పటేల్ నాటిన మొలకగా భావించి, ఆ భావాలను పోషిస్తారు. ఇలా క్రమంగా మనం దేశానికంతటికి ఒకే క్రిమినల్, పీనల్‌కోడ్‌లు వున్నట్టు లా, ఒకే సివిల్‌కోడ్ కూడా రూపొందించుకోవచ్చు. ప్రస్తుతం మహమ్మదీయ రాజ్యాలైన మొరాకో, అల్జీరియాలవంటి రాజ్యాల్లో చట్టాలు మార్చి ముస్లింలకు ఏక భార్యాత్వం పెట్టారు. కాని మన దేశంలో మహమ్మదీయుల చట్టాలు సవరిస్తామంటే అలజడిరేగుతుంది! హిందువుల చట్టాలు అవలీలగా మారుతాయి! ఇది విచిత్ర పరిస్థితి. ఈ పరిస్థితిని దాటాలి.

మౌలికంగా మనకు నిర్ధారిత భూఖండం, అవిచ్ఛిన్నంగా వచ్చే ప్రజ, సంస్కృతి, జీవనవిధానపు మౌలిక విలువలు వున్నాయి. మౌలికంగా సంస్కృత భాష మన జాతీయ భాషలకు తల్లిలా వున్నది.

ప్రపంచం పురోగమిస్తున్నది. వెయ్యేండ్ల బానిసత్వం వల్ల వెనుక బడ్డ మనం త్వరలో దాన్నందుకోవాలి. మనం కూడా అధునాతనమైన పూర్ణవికత రాష్ట్రం (Nation) గా రూపొంది ప్రపంచ పురోగమనంలో ముందుండి మార్గదర్శకులమైననాడే మన పూర్వుల మాదిరి "జగద్గురువు"ల మవుతాం.

జి. వి. యస్. నరసింహారావు

# 1

ఈనాడు భారత సమైక్యతకు, భారతదేశంలోని వారంతా వికసిత మైన జాతిగా రూపొందడానికి పెద్ద అడ్డంకిగా కన్పిస్తున్నది మైనారిటీ లేదా అల్పసంఖ్యాకుల సమస్య. అంటే హిందూ ముస్లిం లేదా హిందూ-క్రైస్తవ సమస్య. ఇలాంటి సమస్య మనకు మాత్రమే వున్న ప్రత్యేక సమస్య కాదు. చిరకాలపు బానిసత్వ ఫలితంగా పాలకుల మతంలోకి జాతిలో కొంత మంది మారిపోయి పాలకుల ఆచార వ్యవహారాలు, పద్ధతులు, నాగరికత అనుసరించే ప్రజలున్న అన్ని దేశాలకూ యీ సమస్య యెదురైంది.

క్రైస్తవ మతం వ్యాపించిన యూరోపుసందలి లేదా మధ్య ఆసియా సందలి అన్ని రాజ్యాలలోను క్రైస్తవ పాలకులు స్థానికంగా వున్న యూదులు లేదా యితర మతస్తులను పూర్తిగా తుడిచిపెట్టారు. పాలస్తీనా లోని యూదులు దేశం వదలి పారిపోయి వివిధ దేశాల్లో తలదాచుకున్నారు. తరువాత మహమ్మదీయ పాలకులు మధ్య ఆసియాలో తమ పరిపాలన క్రిందకు వచ్చిన అన్ని దేశాల నుండి అంటే క్రైస్తవానికి పుట్టినిల్లయిన మధ్య ఆసియాలోని సిరియా, జోర్డాన్, పాలస్తీనా మొదలగు చోట్ల రక్తపు టేరులు పారించి క్రైస్తవులను తుడిచిపెట్టారు. ఈనాడు ముస్లిం రాజ్యాలన బడే ఒకనాటి క్రైస్తవ రాజ్యాల్లో క్రైస్తవులు లేరు!

స్పెయిన్‌లో ఉత్తరాఫ్రికాలోని ఈజిప్టు, లిబియా, టునీషియా, మొరాకో వంటి దేశాల్లోను, బర్మాలో, చైనాలో, రష్యాలో యిలా అనేక దేశాల్లో ఈ మైనారిటీ సమస్య ఒకప్పుడుండేది. అనాగరిక పశుబలం ద్వారా పాలకులు తమ మతస్తులు కానివారిని చంపివేయడం లేదా వెళ్ళ

గొట్టడం ద్వారా ఈ సమస్య పరిష్కరించబడింది. ఉత్తరాఫ్రికా రాజ్యాల్లో ముస్లింమేతరులను ముస్లింలు పూర్తిగా అంతమొందించారు. స్పెయిన్ దేశాన్ని ముస్లింలు జయించి 712 నుండి 1492 వరకు అంటే దాదాపు 780 సంవత్సరాలు మనదేశాన్ని పాలించినట్లే పాలించారు. వారిని స్పానిష్ మూర్‌లు అంటారు. కాని స్పెయిన్‌లోని క్రైస్తవ కాథొలిక్ మతస్తులు చివరకు ముస్లింలను చంపివేయడం ద్వారా తుడిచిపెట్టారు. వాళ్ళ అరబిక్ భాషను కూడా తుడిచిపెట్టారు. వారి నాయకులు, టునీషియా, మొర్రాకో, టర్కీలకు ప్రాణభీతితో పారిపోయారు. ఈనాడు స్పెయిన్‌లో ఒక్క ముస్లిం కూడా లేడు! ఈ తుడిచివేతకు 50 సంవత్సరాలు పట్టింది.

అలాగే పర్షియాలోకి, ఆఫ్ఘనిస్థాన్‌లోకి వచ్చిన ముస్లిం పాలకులు అచ్చటివారిని మతం మార్చడంగాని, చంపివేయడం గాని చేశారు. పర్షియా నందలి జోరాష్ట్రియన్ మతం అనుసరించే స్థానిక పార్శీలు మన దేశానికి వలసవచ్చి యిక్కడ ప్రజలతో కలిసిపోయి ప్రశాంతంగా జీవిస్తున్నారు. వాళ్ళు మన దేశం వలస వచ్చినప్పుడు ఇచ్చటి హిందువుల మానబిందువులైన గోవు మొదలగు వాటిని, యిచ్చటి సంస్కృతిని గౌరవిస్తామని చేసిన వాగ్దానాలను తు.చ. తప్పకుండా యీనాటివరకు అనుసరిస్తున్నారు.

బర్మా స్వతంత్రం పొందిన తర్వాత అచ్చటి ముస్లింలు భారత ముస్లింల మాదిరిగానే తమ మసీదుల ముందు మేళాలు వాయించరాదనీ, ప్రత్యేకతలు కావాలనీ మత కల్లోలాలు రెచ్చగొడితే అచ్చటి బౌద్ధ పాలకులు వారి పిచ్చి కోరికలు తిరస్కరించి, "వుంటే అందరితో సమానంగా వుండండి- యిచ్చటి సంస్కృతిని గౌరవిస్తూ. లేదా ఈ దేశంలో నుండి బయటకు వెళ్ళండి" అని గడువు యిచ్చి, ఆ గడువులోన బర్మా వదలి వెళ్ళని ముస్లిం మతం అనుసరించే బర్మీయులనందరినీ చంపివేశారు. ఈనాడు అక్కడ బౌద్ధ ముస్లిం సమస్య లేదు!

చైనాలో సుమారు 47 సంవత్సరాల క్రితం - అంటే 1940 ప్రాంతాల్లో ముస్లిం మతం అనుసరించే చైనీయులు భారత ముస్లింలకువలెనే తమకు ప్రత్యేకతలు కావాలంటూ దౌర్జన్యాలకు దిగితే వాటిని సాకుగా తీసుకుని సింకియాంగ్ రాష్ట్రంలో ఒక లక్ష మంది ముస్లింలను ఊచకోత కోశారు. అంతే. మళ్ళీ ఈనాటివరకు అక్కడ "ముస్లింమైనారిటీ సమస్య" అనేది తలెత్తలేదు !

రష్యాలో ముస్లింలు అధిక సంఖ్య గల ఆర్మేనియా, తుర్కిస్తాన్ వంటి ప్రాంతాల్లో-అవి ఒకనాడు తనవి కాకపోయినా - టర్కీలోవైనా - తమ మతం అనుసరించే వారి కోసం కలుగచేసుకుని స్వాధీనం చేసుకుంది. అలాంటి చోట్ల ముస్లింలు ప్రత్యేకతలడిగినందుకు వారిలోని ప్రముఖుల నందరినీ "కాన్‌సన్‌ట్రేషన్ క్యాంప్"లకు పంపి, నేటి కమ్యూనిస్టు రష్యా వారిని విచక్షణారహితంగా అణగత్రొక్కింది. ఇటీవలే కొద్ది నెలల క్రితం మళ్ళీ ముస్లింలు కామ్యూనిస్టుపార్టీని కొద్దిమంది ప్రత్యేకతలంటూ తలెత్తాలని చూస్తే "పార్టీశాళన" కార్యక్రమం పేరుతో పదవుల్లోవున్న ముస్లిం నాయకులను తొలగించి తీవ్రంగా అణచివేసిందని పత్రికలలో వార్తలొచ్చాయి.

కాని యితర చోట్ల యీ సమస్య సామరస్యతతో పరిష్కరించబడింది. యుగోస్లావియాలో వున్నది స్లావ్‌జాతి. ప్రస్తుతం అది కమ్యూనిస్టు రాజ్యం. అచ్చటి బాస్నియా రాష్ట్రంలో 75 శాతం ముస్లిం మతస్థులు. అయితే తమ మతాన్ని, ఆచార వ్యవహారాలను వుంచుకుంటూ కూడా అచ్చటి ముస్లిమ్‌స్లావ్‌లు, క్రైస్తవస్లావ్‌లు "మతం నల్లమందువంటిది" అనే కమ్యూనిస్టు స్లావ్‌లు కూడా సామరస్య పూర్వకంగా బ్రతుకుతున్నారు. ఒకరి మత ఊరేగింపుల మీద మరొకరు దాడులు జరుపుకోవడంలేదు. ప్రత్యేకతలు, ప్రత్యేక "స్థాన్"లు కోరడంలేదు. అక్రమ పద్ధతుల్లో

మరొకరిని తమ మతంలోకి మార్చాలనుకోవడంలేదు - మన దేశంలోని మైనారిటీ ముస్లిం, క్రైస్తవ భారతీయులవలె.

ఈ విధమైన పరిష్కారం ఉత్తమమైనది. దీనిని సాధించాలంటే - ఎన్ని మతాలున్నా, ఆచారాలున్నా యిచ్చటవున్నది ఒక్కటేజాతి అనే భావన ప్రధానంగా వుండాలి.

యూరోపులోను, మధ్య ఆసియాలోను అతివిద్వేషపూరితము, తీవ్రము అయిన మత సంఘర్షణలన్నీ అచ్చటి రాజ్యాల ప్రయోజనాల కోసం జరిగినవే. భారతదేశంలోనూ ప్రజలు కేవలం మతాన్ని ఆధారం చేసుకుని విభజించబడలేదు. ముస్లింలు అధిక సంఖ్యగల, సింధు, బలూచిస్థాన్, వాయువ్య సరిహద్దు ప్రాంతం, బెంగాల్‌లో సగం, పంజాబ్‌తో సగం 1947 లో పాకిస్తాన్‌గా యేర్పడ్డాయి. ఆనాడు పాకిస్తాన్ కావాలన్న ముస్లింలీగ్‌ను బలపరచిన భారతీయ ముస్లింలు అధిక సంఖ్యలో యింకా భారత్‌లోనే వున్నారు. (నిజానికి 1946 ఎన్నికల్లో వాయువ్య సరిహద్దు ప్రాంతంలో కాంగ్రెస్ గెలువగా పంజాబ్, సింధుల్లో మిశ్రమ ప్రభుత్వాలొచ్చాయి. అంటే ముస్లింలీగ్ ఓడిపోయింది!) ఈ రెండు కారణాల దృష్ట్యా అది ఒక రాజకీయ కారణంగా ప్రాంతాల విభజన మాత్రమే. కేవలం మతాన్ని ఆధారం చేసుకుని విభజన జరిగివుంటే ప్రతి ముస్లిం భారతీయుని పాకిస్తాన్ పంపించి వుండాల్సింది. మనని పరిపాలించిన ఆంగ్లేయుల కూటనీతి ఫలితంగా మతాన్ని అడ్డంపెట్టి భారతదేశాన్ని ముక్కలుగా చీల్చగల్గారు- ఒకవంక ద్విజాతి సిద్ధాంతం అంగీకరించం అంటూ కూడా వయస్సు మళ్ళిన దేశ నాయకులు ఆంగ్లేయులతో పోరాటం కొనసాగించే ఓపికలేక ఒకసారి 1937 లో అధికారం చవిచూసి, మళ్ళీ దానికోసం ఆత్రుతతో చూస్తూ కొన్ని ప్రాంతాలు పోయినా మిగతా దేశాన్నైనా పాలిద్దామని

తాపత్రయ పడడంవల్ల జరిగిన ప్రాంతాల విభజనవల్ల పాకిస్తాన్ యేర్పడ్డదే గాని కేవలం మతంవల్ల మాత్రం కాదు.

గతంలో భారతీయులు చాలాకాలం బౌద్ధమతం అనుసరించే భారతీయులను వ్యతిరేకించిన మాట నిజం. అయితే ఆ వ్యతిరేకతకు కారణం వారి మతం మాత్రం కాదు. కుషాన్ రాజగు కనిష్కుడు మొదలగు విదేశీ రాజులు భారతదేశం మీదకు దండయాత్రకు వచ్చి మన సరిహద్దుల వద్దకు రాగానే తాము బౌద్ధులుగా మారినట్లు ప్రకటించేవారు. ఈ దేశంలో బౌద్ధ మతం అనుసరిస్తున్న భారతీయులు, హిందువైన తమ రాజుకన్నా తమ మతం అనుసరిస్తున్న విదేశీరాజును సన్నిహితునిగా భావించి, తమ రాజుకు, దేశానికి, సమాజానికి, జాతికి వ్యతిరేకంగా విదేశీరాజుకు సహాయం చేసే పంచమాంగ దళంగా మారడం వల్లనే బౌద్ధులైన హిందువులకు, ఇతర హిందువులకు మధ్య వ్యతిరేకత తలెత్తింది. ఈ వ్యతిరేకత రెండు మోక్ష మార్గాలకు, మతాల మధ్యకాదు. రెండు సామాజిక పద్ధతులమధ్య వ్యతి రేకతకు మూలాధారం సాంఘికమైనదేగాని మతపరమైనదికాదు.

హిందువులవైపుగాచూస్తే ఆనాడు హిందూ బౌద్ధ సమస్యగాని, ఈనాడు హిందూ ముస్లిం లేదా హిందూ క్రైస్తవ సమస్యలుగా మత ప్రాతిపదిక మీద ఆధారపడిలేవు. ఒకే సంతతిలో కొంతవరకు రెండు జీవన సరళిల మధ్య సంఘర్షణలవి. ఒకరి కొకరికి సంబంధంలేని ఉత్స వాలు జరుపుకొనడం, ఒకేచోట దైవాన్ని ప్రార్థించలేకపోవడం, మొదలగు వాటివల్ల అంతర్గతంగా రెండు నాగరికతల మధ్యగల వైమనస్యం అది. దీనివల్ల హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు వేరేవేరే జాతులు అనే భావన పుడుతుంది - ప్రబలుతుంది - ప్రబలుతోంది!

వ్యక్తిగతంగా తీసుకుంటే బాస్నీయులకువలె మనకున్నది ఒకే నాగరికత. అయితే హైందవేతరులలో మత ఛాందసులైన ముల్లాలు,

మౌల్వీలు, విదేశీ క్రైస్తవ మిషనరీ ఫాదరీలు వారి ప్రభావంలో వున్న భారతీయ ముస్లిం, క్రైస్తవ నాయకులు చాలా చాకచక్యంగా చేస్తున్న ప్రచారంవల్ల హిందువులు, ముస్లింలు, క్రైస్తవులు ఒకరినొకరు విదేశీయులుగా చూసుకునేటట్లు చేస్తున్నది. రెండుజాతులు ఒకటి కావడం కష్టంగాని ఒక జాతిని రెండుగా చీల్చడం తేలిక! అదే ఈ దేశంలో జరిగింది. ఫలితంగా పాకిస్తాన్ పుట్టింది. దానితో దేశంలో ప్రతివర్గం తమకు కూడా "స్థాన్"లు కావాలంటున్నారు. మొప్లాస్తాన్, ద్రవిడస్తాన్, ఒస్మానిస్తాన్, స్వతంత్ర నాగాలాండ్, మిజోరాం, ఝార్ఖండ్ మళ్ళీ చిన్న చిన్న క్రైస్తవ స్థాన్‌లు పాకిస్తాన్‌లు యిలా ప్రత్యేక స్థానాలు కోరడం చూస్తున్నాం,

ఒకవేళ ముస్లింలు, క్రైస్తవులు మన దేశంలో హిందువులతో సంబంధంలేని వేరేజాతి వారమని అనుకుంటుంటే మనముందు మూడే మార్గాలున్నాయి.

మనలో మనం శాశ్వతంగా పోరాడుకుంటూ తద్వారా మళ్ళీ విదేశీయులకు అవకాశం కల్పించడం లేదా ఏ అగ్రరాజ్యానికో ఉపగ్రహంగా మారి మరొక ప్రపంచయుద్ధమే వస్తే ఆ అగ్రరాజ్యపు సమిధగా మారి సర్వనాశనం కావడం మొదటి మార్గం.

మళ్ళీ దేశాన్ని విభజించి 1947 లో కొందరు సూచించినట్లుగా ముస్లింలను, క్రైస్తవులను వారి వారి "ప్రత్యేకస్థాన్"లకు పంపి జనాభా మార్పిడి ద్వారా హిందువులంతా మిగతా దేశంలో వుండేటట్లు చేయడం రెండవ మార్గం. అంటే దేశాన్ని దేశంలాగా కాకుండా ఒక ఆస్తిగా భావించి పంచుకుని ముక్కలు ముక్కలు చేయడం.

ఇతర దేశస్థులవలె దేశాన్ని, దేశ అఖండతను పవిత్రంగా, ప్రాణప్రదంగా భావించేటట్లయితే కడవరకూ పోరాడి బలవంతులు నిల్చి బలహీనుల్ని తుడిచిపెట్టివేయడం మతం పేరుతోగాని 'యిజం' పేరుతోగాని వున్న దేశంలోని విచ్ఛిన్నకర శక్తులను సమూలంగా తుడిచి పెట్టడం అన్నమాట. ఇది అత్యుత్తమమైనది. అయితే భారీగా జననాశనం అనివార్యం అవుతుంది. అమెరికా గతంలో ఈ మార్గాన్నే అనుసరించింది. అమెరికా జాతిగా రూపొందిన మొదట్లో దక్షిణాది 13 రాష్ట్రాలు "మేము మిగతా వారితో కలసి వుండం, విడిపోతాం" అంటే దేశాన్ని చీల్చేహక్కు ఎవ్వరికీలేదు అంటూ వారిపై యుద్ధం ప్రకటించి, వారిని ఓడించి, దండించి, అమెరికాలో భాగంగా నిలిపాడు ఆనాటి అమెరికన్ అధినేత. ఉత్తర ఐర్లండు విడిగా వుండడాన్ని సహించని ఐర్లాండు నేటికీ దీనిని సాధించడానికి కృషి చేస్తూనే వున్నది!

మొదటి రెండుమార్గాలు అవాస్తవికం, దేశవినాశనానికి దారితీసేవీ అయినప్పటికీ, యిప్పటి కుహనా మేధావుల పోకడలను చూస్తే ఆ మార్గాలకు అవకాశం లేకపోలేదు అనిపిస్తుంది.

కేవలం మతం వేరైనంతమాత్రాన ఒకే హిందూ సంతతికి చెందిన ముస్లింలు, క్రైస్తవులు, ఇతర హిందువులు వేరేవేరే జాతులవారా? పై మార్గాలుతప్ప మనకు గత్యంతరంలేదా?

భారతదేశ చరిత్రను నిష్పాక్షికంగా పరిశీలిస్తే వారు వేరే జాతులవారు కారని స్పష్టమవుతుంది. పాకిస్తాన్ ఏర్పడిన తర్వాత కూడా ఒకే మతస్తులైనంతమాత్రాన పాకిస్తాన్‌లోని ముస్లింలు ఒక జాతిగా మారలేకపోయారని స్పష్టమవుతున్నది. తూర్పుబెంగాలు ముస్లింలు విడిపోయి బంగ్లాదేశ్

యేర్పడింది. సింధులో "జియేసింధు" పేరుతో విడిపోవాలనే ఉద్యమం పుంజుకుంటున్నది. ఫక్తూనిస్తాన్‌కోసం పోరాటం సాగుతూనేవుంది. బలూచిస్తాన్ తమ ప్రత్యేకతకై తహతహ పడుతున్నవి. అసహజంగా సృష్టించబడ్డ పాకిస్తాన్ విచ్ఛిన్నం కావడం అతి సహజం! కేవలం మతం ఒకటైనంత మాత్రాన ముస్లింలు గాని, క్రైస్తవులుగాని మనదేశంలో వేరేజాతులు కాదని, వారు ఒకే హిందూసమాజానికి చెందినవారని, వారి పూర్వీకులు ఒకరేనని స్పష్టంగా చరిత్ర చాటుతున్నది. గతంలో విదేశీ మహమ్మదీయుల పరిపాలనాకాలంలోను, విదేశీ ఆంగ్లేయుల పరిపాలనా కాలంలోను కొన్ని పరిస్థితులవల్ల, కొన్ని సౌకర్యాలకోసమో, ప్రాణభయం వల్లనో, పదవుల కోసమో, అధికారంకోసమో, సామాజికంగా స్థాయి పెరుగుతుందనో, డబ్బుకోసమో, వనితా వ్యామోహంతోనో లేదా యితర తప్పుడు మార్గాల ద్వారానో హిందువులే కొందరు ముస్లింలుగాను క్రైస్తవులుగాను మారాటు-మార్చబడ్డారు. ప్రపంచం దృష్టిలో వారు యీనాటికే హిందువులే. "హజ్" యాత్రకువెళ్లే భారత ముస్లింలను హిందువులనీ, హిందూముస్లింలనీ వ్యవహరిస్తారు. అలాగే పరోపాదేశాలైన ఫ్రాన్సువంటి దేశాలకు వెళ్లిన భారతక్రైస్తవులను హిందూ క్రిష్టియన్లు అనే అంటారు. అయితే మనదేశంలోని హిందువులు ముస్లింలు క్రైస్తవులు ఈ విషయాన్ని గుర్తించడంలేదు. విస్మరించారు. ఆంగ్లేయుల బానిస విద్యావిధాన ఫలితంగా ఈ విషయం స్పష్టంగా ప్రకటించడానికి కావల్సిన గుండెధైర్యంకూడా లేని పిరికిపందలుగా తయారయ్యారు. మరొకవంక విదేశీ ప్రాబల్యంగల మౌల్వీలు, ముల్లాలు, మిషనరీఫాదరీలు ముస్లింలలో క్రైస్తవులలో హిందువులపై విద్వేషభావాన్ని రెచ్చగొడుతూ క్రమపద్ధతిలో పనిచేస్తున్నారు.

స్పష్టమ్మయిన భావాల్తో చరిత్రపట్ల, మాతృభూమిపట్ల, పూర్వీకుల పట్ల అవగాహన, అభిమానం ప్రేమ సేవాభావాలు పెంపొందించడంద్వారా

వారిని ఒకే ప్రజగా, ఒకేరాష్ట్రం లేదా జాతిగా పెనవేయవచ్చు. అందరూ ఒకేజాతిగా రూపొందాలనుకుంటున్నారా లేదా అన్నదే ప్రధానం.

మతాన్నిబట్టి జాతివుంటుంది అనుకుంటే గ్రామగ్రామాల్లో ముస్లింలు క్రైస్తవులు అధికంగా వున్నచోటల్లా ఒక చిన్న పాకిస్తాన్ ఒక చిన్న పాదరిస్తాన్ ఏర్పడుతుంది. హిందువులు అధికంగా వున్నచోట్ల క్రైస్తవులు, ముస్లింలు వుండాలా వెళ్ళిపోవాలా? లేదా వారందరినీ బలవంతంగానైనా హిందువులుగా మార్చాలా? అలా చేయడం సబబా?

ఒకరకంగా ఆలోచిస్తే యిది బేసబబు. అవాస్తవికం. ఆచరణాత్మకం కాదు. అనుసరణీయం కానట్టి యోచన. ముఖ్యంగా హిందువులే మతాంతరీకరణపట్ల వ్యామోహితులు కారు. ఏకంసత్ విప్రా బహుధా వదంతి. భగవంతుడొక్కడే. ఏ పేరుతో పూజించినా అని నమ్మి—

ఆకాశాత్పతితం తోయం యథాగచ్ఛతి సాగరం
సర్వదేవ నమస్కారాన్ కేశవం ప్రతిగచ్ఛతి

అంటూ భావించే హిందువులను ఈ సంస్కృతి మతదురభిమానులు కాకుండా కాపాడింది. అందువల్ల ముస్లింలు క్రైస్తవులు హిందువులు మత రీత్యా ఏర్పడిన జన సామాన్యపు గుంపులు కారు. ఒకే జాతికి, సంతతికి చెందినవారిలో కొందరు, సనాతన, శైవ, వైష్ణవ, శాక్తేయాది పంథాల్ని అనుసరించినట్లుగా, అల్లా, క్రీస్తు పంథాల ననుసరించే హిందువులే యీ దేశంలోని ముస్లింలు-క్రైస్తవులు. ఈ గుర్తింపు అందరిలో రావాలి. రప్పించాలి-విద్య ద్వారా-ప్రచారంద్వారా అవసరమైతే బలప్రయోగం ద్వారా కూడా. మన జాతి వికసించడానికి యిది ప్రాథమికావసరం. క్రైస్తవుల, ముస్లింల పూర్వీకులు ఒకరే. వారు విదేశాలనుండి వచ్చినవారు

కాదు. హిందూ నాగరికత, సంస్కృతి తప్ప వారికి వేరే నాగరిక సంస్కృతులు లేవు అనే గుర్తింపు వారికి తెప్పించాలి. మతాన్ని గూర్చి ఎంత తక్కువ మాట్లాడితే అంత మంచిది.

ఉత్తర భారతంలోను, దక్షిణాదిన మనం గమనిస్తే వారి భాష భూష (వేషం) లు హిందువులనుంచి వారిని వేరేగా గుర్తించలేనట్లుగానే వుంటాయి. ఆతిథ్యపు అలవాట్లు ఒక్కటే. ఇళ్ళముందు ముగ్గులు కూడా వేస్తున్నారు. సాధారణ ఊరేగింపులు ఒకలాగానే వుంటాయి. చర్చిలలో ప్రార్థనలు ఆయా ప్రాంతీయ భాషల్లోనే చేస్తారు. ఇంగ్లాండు నందలి నార్మన్ లేదా గోథిక్ పద్ధతులలో కట్టబడిన చర్చిలున్నా దాక్షిణాత్య ద్రావిడ పద్ధతులలో కట్టబడ్డ చర్చిలు కూడా వున్నాయి. చర్చిలనడం మానేసి దేవాలయాలంటున్నారు! సాగరమాత దేవాలయం, మేరీమాత దేవాలయం అంటున్నారు. కొన్నిచోట్ల చర్చిలలో కొవ్వొత్తులు వెలిగించడం మాని సాంబ్రాణి, అగరొత్తులు వెలిగించే హిందూ పద్ధతులనుసరిస్తున్నారు. క్రైస్తవపేర్లు కూడా ప్రాతీయం చేయబడేవి. డేవిడ్ దావీదుగా, డేనియల్ దానియేలుగా మలచబడ్డాయి. పేర్లుకూడా పారిజాతం, పుష్పనాథం, నవనీతం వంటి దేశీయ నామాలు పెట్టుకుంటున్నారు. ఇది ఒక రకంగా ఆశించతగ్గ ముదావహమైన పరిణామం. బెంగాలులో ప్రొటెస్టెంటులైన క్రైస్తవులు భారతీయమైన పేర్లు పెట్టుకుంటారు. ఇలా హిందువులనుండి వారిని విడిగా గుర్తించడం వీలులేని పద్ధతులు అనుసరిస్తారు. విద్యాధికుల్లో కొంచెం విజ్ఞత గలవారిలో క్రైస్తవులను హిందువులను వేరుచేస్తున్న తేడాలు తగ్గుతున్నాయి.

మహమ్మదీయుల జాతీయ వ్యతిరేకతను గూర్చి మాట్లాడడం తేలిక అయితే అన్ని వేళలా, అన్నిచోట్లా సబబుకాదు. విదేశీ విద్యాభ్యాసం చేసిన వారిలో మొదట్లో జాతీయ వ్యతిరేక భావాలుండేవి కావు. జిన్నావంటి

వారలు మొదట్లో అధునాతన పురోగామి దృక్పథంతో వున్నా నాటి దేశ నాయకులు కరడుగట్టిన మతోన్మాదులైన ముస్లింల, వారి నాయకులను రాజకీయ కారణంగా బుజ్జగించడం ప్రారంభించారు. వారినే యావన్మంది ముస్లింలకు ప్రతినిధులుగా భావించారు. మహాత్మా గాంధీకన్నా యెంత దుర్మార్గుడైనా, హీనుడైనా అయిన, ముస్లింనే తన వాడిగా భావిస్తానన్న మహమ్మదాలి షౌకతాలీలను, ముస్లింల ప్రతినిధిగా గుర్తించి విశాలమైన అధునాతనమైన భావాలుగల జిన్నాను దూరం చేసుకున్నారు నాటి నాయకులు. ఫలితంగా జిన్నా కరుడుగట్టిన ముస్లిం మతోన్మాదిగా మారాడు. ఆంగ్ల వైస్రాయి దగ్గరుండి 1906 లో ప్రారంభించిన ముస్లిం లీగును మాత్రమే ముస్లింల ప్రతినిధిగా గుర్తించడమనే పొరపాటును నాటి నాయకులు చేశారు. అంతటితో ఆగకుండా ముస్లింలు మొదటిసారి కోరిన 7 కోర్కెలను ఆమోదించారు. ముస్లింలు మళ్ళీ 14 కోరికలు కోరితే వాటినీ అంగీకరించడమనే తప్పు చేశారు. హిందూ ముస్లిం ఐక్యతకంటూ వారిని సంతృప్తి పర్చాలని తాపత్రయంతో వారు మరొకసారి 21 కోరికలు కోరితే వాటినీ అంగీకరించారు. వారు ప్రత్యేక నియోజక వర్గాలు కావాలంటే యిచ్చారు. దేశపు జండాను కాంగ్రెస్ వారు నియమించిన జాతీయ జండా కమిటీ (జవహర్‌లాల్ నెహ్రూ, మౌలానా అబుల్ కలాం అజాద్ దానిలో సభ్యులు) కాషాయ ధ్వజాన్ని జాతీయ జండాగా చరిత్ర పరిశీలించిన తర్వాత నిర్ణయిస్తే అది హిందువుల జండా అని ముస్లిం మతోన్మాదులన్నారని ముస్లింలకోసం పచ్చరంగు, యితర్లకోసం తెల్లరంగు, శిక్కులకోసం మధ్య చర్ఖా నీలం రంగు వుండేటట్లు చేశారు! జాతీయ గీతం వందేమాతరంలో 'త్వంహిదుర్గా దశ ప్రహరణ ధారిణీ, కమలా కమలదళ విహారిణీ, వాణీ విద్యాదాయినీ' అని హిందువుల పేర్లున్నాయంటే వందేమాతరాన్ని వదులుకోవడానికి సిద్ధపడ్డారు. హిందీ సంస్కృతజన్యంగా వుంది, హిందువులది సంస్కృత భాష కనుక మాకు వద్ద

ముస్లింలంటే వారికోసం అరబ్బీ, పర్షియన్ పదాలతో కూడిన హిందూస్తానీకి ఆమోద ముద్ర నిచ్చారు. ఇలా సంతుష్టీకరణ వల్ల, బుజ్జగింపు విధానం వల్ల దేశనాయకులుగా వున్న కాంగ్రెస్ నాయకులే ముస్లిం సామాన్య ప్రజలను కరడుగట్టిన ముస్లిం మతతత్వంగల నాయకులవైపు మళ్ళించారు! ఫలితంగా దేశాన్ని కూడా ఖండఖండాలు చేశారు. ఈ పాపం నిజానికి హిందువులు స్వాతంత్ర్య సంగ్రామంలో తమ నాయకులుగా నమ్మిన కాంగ్రెస్‌లోని హిందూ నాయకులది. కేవలం ముస్లింలది అనడం కొంత వరకే నిజం. పూర్తి నిజం కాదు.

జర్మన్ జాలర్లమధ్య, ఫ్రెంచి జాలర్లమధ్య వున్నంత తేడా బెంగాలీ హిందూ జాలర్ల మధ్య బెంగాలీ ముస్లిం జాలర్ల మధ్య లేదు! ముస్లిం లేదా హిందూ వ్యవసాయ దారులమధ్య తేడా వుందేమో చూపమనండి. బాస్నియాలో గల ముస్లిం స్లావ్, క్రిష్టియన్ స్లావ్ సంతతి వారి వలె వారు ఒకేభాష మాట్లాడుతారు - బెంగాలీ భాష. ఒకే జీవిత పద్ధతిలో బ్రతుకుతున్నారు. ఆదిలో దేశమంతటా ముస్లింలు యిలాగే వున్నారు. స్థానిక భాషలే మాట్లాడేవారు. కొన్ని మూఢ నమ్మకాలుంటే వుండవచ్చు. కొన్ని చిన్నచిన్న విషయాల్లో తేడాలుంటే వుండవచ్చు. సాధారణ హిందూ జన సామాన్యంలో వలెనే వారిలోనూ, క్రైస్తవులలోనూ - జన సామాన్యంలో రాష్ట్రీయ చైతన్యం తక్కువగా వుండేది. చారిత్రికంగా చూస్తే ఇస్లాం ఒక సంస్కృతి. అంతేగాని, జాతి లేదా రాష్ట్రం మాత్రం కాదు.

హిందువుల పరిస్థితి మరీ విచిత్రం. అతను తనని "ఇండియన్" అనుకుంటాడు. ముస్లింలకు కోపంరాదు కనుక భారతీయుడు అనుకోమంటే అనుకుంటాడు! హిందువు అన్నా భారతీయుడన్నా ఒకటే అర్థమైనా హిందువు అనుకొనడానికి సిగ్గుపడతాడు. కాని ధైర్యంగా తను ఫలానా కులస్థుడిని అని చెప్పుకుంటాడు! కులవాదైనా కావచ్చు కాని రాష్ట్రీయత

లేదా జాతీయతమాత్రంకాదు. నిజానికి హిందువుల్లో అధికులు ఏరాష్ట్రీయతా లేని "అజాతీయులుగా" తయారవుతున్నారు! అందువల్లనే విద్యాధికులం అనుకునే కొందరు ఆంగ్ల విద్యాప్రభావంలో పడి, మన చరిత్రను విస్మరించి, మనం గతంలో ఎప్పుడూ ఒక జాతిగా లేమనీ, ఆంగ్లేయులు వచ్చాకనే మనం ఒక జాతిగా తయారవుతున్నామనీ(we are a nation in making) భావించి భారతమాత ఉత్తమ పుత్రులలో ఒకరైన గాంధీజీని "జాతిపిత"ను చేసి, భారతమాతకు ఆమె కుమారునే భర్తగా చేశారు! వేదాల్లో ఇతిహాసాల్లో మన ప్రాచీన సాహిత్యంలో మనని ఏకజాతిగా పేర్కొన్న విషయాలు వారికి తెలియవు. "సముద్ర పర్యంతా ఏకరాట్" అన్న వేద వాక్యంగాని, 'మాతా పృధ్వీ పుత్రోహం పృధివ్యాః' అన్న మాట గాని, 'జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసి' అన్న మాటగాని, 'ఆ సింధు సింధు పర్యంత యస్య భారత భూమికాః మాతృ భూ పుణ్యభూశ్చైవ సవై హిందురితి స్మృతిః' అన్న మాట గాని, 'ఉత్తరం యత్ సముద్రశ్చ హిమాద్రిశ్చైవ దక్షిణం తంవర్షం భారతనామ భారతీ తత్ర సంతతిః' అన్న విషయం గాని, వేదకాలంనుండి మనం ఒక రాష్ట్రం లేదా జాతి అనే విషయాన్ని చదువుకున్న హిందువులు తాము మరచిపోయి మిగతా హిందువులు మరచిపోవడానికి తోడ్పడ్డారు! కొంత మంది హిందువులు ముస్లిం పండుగ మొహరంలోను, హిందువుల నాశనం చేసే కృషిలో చనిపోయిన ముస్లింల దర్గాలవద్ద జరిగే ఉరుసుల్లోనూకూడ పాల్గొంటూవుంటారు. దీనికారణం హిందూత్వం అనేది మతం కాదు. అది జాతీయత. హిందూయిజం లేదా హిందూ మతం అనేది ప్రపంచంలోనే లేదు. సనాతన మతం, శైవం, వైష్ణవం, శాక్తేయం, పాశుపత మతం, బౌద్ధం, జైన, శిక్కు వగైరా మతాలు, ఆధునిక కాలంలో బ్రహ్మ సమాజం, ప్రార్థనా సమాజం, ఆర్యసమాజం, వివిధ బాబాల పంథాలు అనేకం కొట్టుకొచ్చాయి. కాని హిందూమతం అనేది "పఖశక్కి", అది ఆంగ్లేయుల విశ్వామిత్ర సృష్టి.

అందువల్లనే హిందువులు మత మౌఢ్యంగలవారు కారు. విగ్రహారాధన వ్యతిరేకించేవారైనా బెంగాల్‌లో దుర్గా పూజప్పుడు, ఒరిస్సాలో జగన్నాథ రథమప్పుడు ముస్లింలు, క్రైస్తవులు పాల్గొన్నట్లే హిందువులు ముస్లింల మొహర్రం వేడుకల్లోను, క్రైస్తవుల క్రిస్టమస్ వేడుకల్లోను పాల్గొంటారు. దేశ విభజనకు ముందు ముస్లింలు స్థానిక హిందూవుత్సవాల్లో పాల్గొనేవారు. 1939 లో మిడ్నపూర్ వీధుల్లో ముస్లింలు జగన్నాథ రథాన్ని లాగడం చూశాం. ఇటీవలకూడా, భారతమాత గంగామాతల రథయాత్రల్లో ముస్లింలు, క్రైస్తవులు పాల్గొనడం చూశాం. వారు అలా ముస్లింలుగా చేయ లేదు. హృదయాంతరాళాలలో తాము ఈ దేశీయులం, ఈ జాతీయులం అనే భావన నిద్రాణమై వుండడంవల్ల చేశారు. హిందువుల హృదయాల్లో ముస్లింలు క్రైస్తవులు నా సోదరులే, వారి సంతోషాన్ని నేనూ పంచుకోవాలనే నిద్రాణ మైన కోరికవల్లనే వారి ఉత్సవాల్లో పాల్గొనడం జరుగుతున్నది. నిద్రాణమై వున్న ఈ జాతీయ భావనను మేల్కొల్పాలి. అది మన కర్తవ్యం.

ప్రభుత్వోద్యోగాలకోసం, ప్రత్యేక సౌకర్యాలకోసం హిందువులలో కులతత్వము, ముస్లిం, క్రైస్తవుల్లో మతతత్వము రెచ్చగొట్టబడుతున్నది. ఇది కాదనలేని సత్యం. ఆంగ్లేయుల కాలంలోనే ముస్లిం విద్యాధికుల్లో వాళ్ళు ముస్లింలు తాము ఈ దేశంలో ఆంగ్లేయులకు ముందున్న పాలకులం కనుక ఆంగ్లేయులు మాకే అధికారం యిచ్చి వెళ్ళాలి అనే భావం కలిగించబడింది. అందువల్లనే రాజకీయాల్లో వున్న "ముస్లింను గీచి చూడండి మీకు ముస్లిం కనబడతాడు" (**Scratch a Muslim you will find a leageor in him**) అని అనడం జరిగింది. (ఫ్రాంటియర్)సరిహద్దుగాంధీగా పేరొందిన ఖాన్‌అబ్దుల్ గఫార్‌ఖాన్ తాను కాంగ్రెస్‌లో చేరడానికి కారణం మహాత్మా గాంధీ తదితరులు తనకు "ఫక్తూనిస్తాన్" ఇస్తానని వాగ్దానం చేశారనీ, జిన్నా దానిని వ్యతిరేకించాడనీ అన్నారు. మరొక జాతీయ ముస్లిం నాయకుడు

అబ్దుల్ కలాం ఆజాద్. ఆయన "ఇండియా విన్స్ ఫ్రీడం" అనే పుస్తకం రాశాడు. దానిలో నౌఖాలీలో హిందువులను ముస్లింలు మూకుమ్మడిగా హత్యాకాండ జరిపిన దానిని గురించి ఖండిస్తూ ఒక్క వాక్యం లేదు. తను చెప్పిన విధంగా ముస్లింలు ప్రవర్తించి వుంటే యావద్భారతానికీ వారు అధిపతులయ్యేవారనీ, జిన్నాను అనుసరించడంవల్ల కొద్దిపాటి పాకిస్తాన్ మాత్రం లభించిందనీ వాపోవడం జరిగింది! అందువల్లనే సర్దార్ పటేల్ 'ఈ దేశంలో ఒకే ఒక జాతీయ ముస్లిం వున్నాడు; అతడు పండిట్ జవహర్ లాల్ నెహ్రూ' అని చమత్కరించాడు!

స్వాతంత్ర్యం ముందుకువలెనే ముస్లింలను సంతృప్తి పరచాలనే విధానం సాగుతున్నది. కులం పేరుతోగాని, మతం పేరుతోగాని, వెనుకబడ్డ తరగతుల పేరుతోగాని ఏ పేరుతోనైతేనేమి, రిజర్వేషన్లు వంటి ప్రత్యేక సౌకర్యాలు వేర్పాటు వాదాన్ని, తత్వాన్ని రంగరించిపోస్తున్నాయి. పెంపొందిస్తున్నాయి. అధికారం, డబ్బు, బిరుదులు, పలుకుబడి మొదలగు వాటికోసంకాక, జాతి, జాతి ప్రయోజనాలు ప్రధానం. ఆ తర్వాతే మిగతావి అనే భావన రావాలి. అది త్వరగా రానందువల్లనే దేశం చీలింది. ఇప్పటికైనా తీసుకరాకపోతే యింకా అనర్థాలు జరుగుతాయి. కొంతవరకు ఈ భావన వచ్చిన మాట నిజమే. కాని రావాల్సినంతగా రాలేదు. అవసరమైతే బలప్రయోగం ద్వారానైనా ఈ భావాన్ని తెప్పించడం దేశానికి అవసరం.

# 2

మహమ్మదీయుల్లోవున్న లోపాలు, మత మౌఢ్యం, భారత వ్యతిరేకతా భావనలు, దుందుడుకుతనం, 1940లోవలె నేడు కూడా హిందువుల్లో

సాధారణంగా చర్చనీయాంశాలుగా కన్పిస్తున్నాయి. అరేబియా దేశాల నుండి దిగుమతయిన "పెట్రోడాలర్ల" సహాయంతో మీనాక్షిపురంలో మూకఉమ్మడిగా హరిజన హిందువులను మతం మార్చడము, ఆంగ్లేయుల కాలంనుండీ కూడా విచక్షణారహితంగా అమలుపర్చబడుతున్న క్రిమినల్ చట్టాలలోని "మనోవర్తి" విషయంలో సుప్రీంకోర్టు తీర్పుకు వ్యతిరేకంగా షాబానో కేసు తీర్పు విషయంలో ఆందోళన లేవనెత్తడం, వారి ఓట్ల కోసం ప్రాకులాడే అధికారంలోవున్న రాజకీయవేత్తలు లొంగిపోయి ఆ క్రిమినల్ చట్టాలలోని "మనోవర్తి" యిచ్చే భాగాలు "ముస్లిం"లకు చెల్లవంటూ వారి కోసం ప్రత్యేక చట్టం చేయడం, రామ జన్మభూమి విషయంలో దాదాపు అన్ని రాజకీయ పక్షాల్లోవున్న ముస్లింలు యేకమై "భారత్ రిపబ్లిక్ ఉత్సవాలను బహిష్కరించడం" అనేటంత జాతి వ్యతిరేక చర్యకు పూనుకోబూనడం, ముస్లింలు అధిక సంఖ్యలో గల పట్టణాల్లో లేదా బస్తీలలో మత కల్లోలాలు రెచ్చగొట్టడం, కాశ్మీర్ మొదలైన ప్రాంతాల్లో దేవాలయాలను నేలమట్టం చేయడం, క్రికెట్ ఆటలో పాకిస్తాన్ భారత్‌పై గెలిస్తే బాణాసంచా కాల్చి వేడుకలు జరపడం, హిందువుల మీద అత్యాచారాలు జరపడం, దేశవ్యాప్తంగా ముస్లింలు అధిక సంఖ్యగల జిల్లాల సంఖ్య ముఖ్యంగా సరిహద్దుల్లో పెరగడానికి బంగ్లాదేశ్‌నుండి పాకిస్తాన్ నుండి పథక ప్రకారం భారతదేశంలోని వస్తున్న ముస్లింలకు రక్షణ వసతులు కల్పించడంద్వారా ప్రయత్నించడం, హిందువుల మీద దాడిచేయడానికి "ఆదంసేన" వంటి వాటి నిర్మాణం-ఇలాంటి అనేక చర్యలవల్లనే కావచ్చు-ఈనాడు ముస్లింల ప్రవర్తనను గురించి చర్చించడం-ఆందోళన చెందడం జరుగుతున్న మాట యదార్థం. అలాగే క్రైస్తవ మిషనరీల చర్యల గురించి కూడా యీనాడు సామాన్యుల సంభాషణల్లో చర్చించడం జరుగుచున్నది.

# హిందువులు ఆత్మవిమర్శ చేసుకోవాలి

అయితే వారిని గురించి ఆలోచించే ముందు మన యొక్క లోపాలను గురించి పూర్తిగా ఆలోచించడం మర్చిపోకూడదు. అసలు క్రైస్తవులు ముస్లింలు యీ దేశంలో తయారవుతున్నారంటే అది పూర్తిగా మనలోవున్న లోపాలవల్లనే గదా! మహమ్మదీయులు, ఆంగ్లేయులవలెగాకుండా వెలలేని మన కళా సంపదను నాశనం చేశారు. అయితే వారు ప్రాతినిధ్యం వహిస్తున్న సంస్కృతితో పోలిస్తే యిదంత ముఖ్యంకాదనిపిస్తుంది, హిందువులలో తమ సంస్కృతిపట్ల స్వాభిమానం, దానిని నిలుపుకోవాలనే తాపత్రయం, సామూహిక చైతన్యంవుంటే, అది శిథిలమైన అనేక సాంస్కృతిక చిహ్నాలకన్నా, నాశనం చేయబడ్డ అనేక దేవాలయాలకన్నా, తగలపెట్టబడ్డ అనేక కోటలకన్నా ఎంతో విలువైనది అవుతుంది. అది వుంటే నాశనమైన వాటినన్నింటిని సాధించుకోవచ్చు, పునర్నిర్మించుకోవచ్చు, సంస్కృతిని పునరుజ్జీవింపచేసి వికసింప చేయవచ్చు. విదేశీయులైన మహమ్మదీయులు మన మీద దాడిచేస్తే జయచంద్రుని వంటి ద్రోహులు అతనికి సహాయపడటం గురించి ఆలోచిస్తున్నాముగాని దేశ రక్షణ బాధ్యత ప్రతి ఒక్క పౌరునిదిగా ఆనాటి సమాజం భావించక కేవలం ఆ బాధ్యత క్షత్రియులదే నన్నట్లుగా ప్రవర్తించడంవల్లనే దేశానికి ఎక్కువ నష్టం వాటిల్లిందనే విషయాన్ని మనం గుర్తిస్తున్నామా? ఆనాడు మన పూర్వులు ఆ పొరపాటును చేయబట్టే తురుష్కులు, పఠానులు, మొగలులు మనని ఓడించగల్గారు. పవిత్ర సోమనాధ దేవాలయాన్ని నాశనంచేశారు. చిత్తూరు రాణులు అగ్నికాహుతయారు. శ్రీకృష్ణ జన్మస్థలం, శ్రీరామజన్మభూమి, తేజేశ్వరాలయం, కాశీ విశ్వేశ్వరాలయం వంటి అనేక దేవాలయాలు మసీదులుగా మారాయి. ఉత్తరాన యింత జరుగుతున్నా అదే ఉత్తరాదినగల యితర రాజులు తమదాకా వచ్చేవరకు చూస్తూ కూర్చొన్నారేగాని ఈ ముస్లిం దాడులకు గురి కాబడుతున్న ప్రాంతాలలోని రాజులకు సహాయంగా వెళ్లలేదు, ఇక దక్షిణా

దిన ఈ ముస్లిం దండయాత్రలను నిలువరించే బాధ్యత తమకేమీలేదన్నట్లు గానే యిచ్చటి హిందువులు ప్రవర్తించారు. విదేశీ దండయాత్ర దేశంలో ఏ మూల జరిగినా బాధ్యత అచ్చటి క్షత్రియులది-లేదా అచ్చటి రాజుది, ప్రభుత్వానిది-మనదికాదు అని హిందూ సమాజం భావించడమనే పొరపాటు జరిగి వుండకపోతే దేశంలో ముస్లిం సమస్య అనేది వుండేది కాదు.

## మన జీర్ణశక్తి లోపించింది

తమలో నుండే మహమ్మదీయులుగా మారిన కొందరు హిందువులను (తరువాత క్రిష్టియన్లను కూడా) మిగతా హిందూ సమాజం తమ ప్రవర్తన ద్వారా కూడా వారిని దూరం చేసుకున్నదనే సత్యాన్ని గుర్తించాలి. ఫలితంగా వారు హిందూ వ్యతిరేకభావాలకు లోనయ్యారు. వారిని హిందూ సమాజం జీర్ణం చేసుకోలేకపోవడం జరిగింది. డరయస్ కాలపు పర్షియన్లని, అలెగ్జాండర్ కాలపు గ్రీకులను, యూథిడెమోస్ కాలపు శకులను, కనిష్కుని కాలపు కుషానులను, హూణులు, సిథియన్లు, పార్థియన్లు మొదలగు అనేక మంది దురాక్రమణపరుల కాలంలో మతం మారిన హిందువులను తమలోకి ఆహ్వానించి, వారిని జీర్ణం చేసుకోవడం జరిగింది. గంగలో మిగతా నదులు కలిసినట్లుగా వీరిని హిందూ సమాజం లీనం చేసుకోలేకపోయింది. మన రక్తంలో గ్రీకు, ఇరానీ, హూణ,కుషాను, శక, సిథియన్, పార్థియన్ రక్తం కల్సిపోయింది. మన కులాలు వాటిని ఆపలేక పోయాయి. అలా మహమ్మదీయులను క్రైస్తవులను మనం జీర్ణం చేసుకోలేకపోయాం. మిహిరగులుని విదేశీ శత్రుమూకలకన్నా బెంగాల్‌లో పీర్ ఆలీచే మతం మార్చబడ్డ బ్రాహ్మణులు- వెలివేయబడ్డవారు- మనకు విరోధులా? మైకేల్ దత్తుకన్నా మనకు విదేశీ దండయాత్రలు జరిపినవారు సన్నిహితులా? పూర్వపు విదేశీ దండయాత్రలు చేసినవారి అనుచరులను జీర్ణించుకున్న మనము వీరి నెందుకు మనలో లీనం చేసుకోకుండా "వెలి" అనే పేర్లతోనో మరొక

పేరుతోనో దూరంగా వుంచడం జరుగుతోంది? వీరిలో హిందూ పూజా పద్ధతులు, హిందూ జీవన పద్ధతిలో కనీసం కొన్ని పోకడలు, సాంస్కృతిక విలువలు కల్గి వున్నారు గదా! కేవలం విదేశీ ముస్లిం, క్రైస్తవులవలె పూర్తిగా భిన్నమైనవాళ్ళు కాదుగదా. వీరు మన రక్తంలో రక్తం. మన మాంసంలో మాంసం. వీరి పూర్వీకులు, మన పూర్వీకులు ఒకరే. ఒక సంతతివారమే. దేవుని పూజించే మతం మాత్రమే వారు మార్చుకున్నారు. మనం శివుడినో కేశవుడినో పూజిస్తుంటే వాళ్లు అల్లానో, యెహోవానో పూజిస్తున్నారు. నిజానికి యింతకన్నా మతం మారిన హిందువులకు మిగతా వారికి ఏమన్నా తేడా వుందా? హిందూ సంతతికే చెందిన వీళ్ళు మతం మారి హిందూ సమాజానికి తమకు తామే దూరం అవుతున్నారని అనుకున్న వివేకానందుడు నిర్వచించిన "ప్రపంచ మతం" కాతగ్గ మన హిందూ మతం నాస్తికుల నుండి ఆస్తికులవరకు అందరినీ ఋషులుగా గౌరవించి వారి పంథాలను గౌరవించే "హిందూ గంగ"లోకి వారిని ఆహ్వానించక పోవడం హిందువుల లోపం. వారిని "వెలి" వేయడం సబబు కాదు. నిజానికి హిందూ మతం అనబడేది అనేక మతాలకు సంగ్రహ నామం. హిందూ దేవుళ్ళ జాబితాలో మరి కొందరు దేవుళ్లు ఈ మతం మారిన ముస్లింలవల్ల, క్రైస్తవులవల్ల వచ్చి చేరితే ప్రమాదం ఏముంది? "హిందూ మతం" అనబడే అనేక మతాల కూడలిలో అనేక పంథాలు చేరుతుండగా మతం మారిన ముస్లిం, క్రైస్తవ హిందువులు మరికొన్ని సిద్ధాంతాలు పంథాలు కలుపుతే వచ్చే నష్టమేమిటి? ముస్లింలు తీవ్రంగా నమ్మే ఒకే దేవుడిని, క్రైస్తవులు "ట్రినిటీ" అనే ముగ్గురిపట్ల గల విశ్వాసాన్ని హిందువులు కాదనాల్సిన పనేలేదు.

# రాజకీయ స్వాతంత్ర్యం వచ్చినా మత స్వాతంత్ర్యం రాలేదు!

నిజానికి చరిత్ర గమనిస్తే హిందూ సమాజం ముస్లింలను జీర్ణం చేసుకునే ప్రక్రియ కొంతవరకు ప్రారంభమైనది. ముస్లింలలో "సూఫీ" సాంప్రదాయం ఇస్లాం హిందూ సంస్కృత మేళవింపు. బెంగాల్ కవి నజ్రుల్ ఇస్లాం, కబీర్, రసఖాన్, అబ్దుల్ ఖాన్ ఖాజా, రసూల్ ఖాన్ వంటివారలు మతం మారిన ముస్లింల హిందువుల విలీనీకరణకు బాటలు వేశారు. దురదృష్టవశాత్తు యింతలో మనం ఆంగ్లేయుల పాలనలోకి పోవడం, ఆంగ్లేయుల "విభజించి పాలించు" అనే నీతికి బలి కావడంవల్ల ముస్లిం భారతీయకరణ ప్రయత్నాలు నిలిచిపోయాయి. అయితే యిటీవల కాలంలో మహారాష్ట్రలో హమీద్‌దల్వాయ్, మద్రాసులో జాన్, మహమ్మద్ కరీంభాయ్ చాగ్లావంటివారు యిచ్చటి సాంస్కృతిక జీవితంతో మమేకమై మనకు మార్గదర్శనం చేశారు. హిందూ సమాజం కాలానుగుణ్యంగా మార్చుకొనడంలో విఫలమైనట్టిన్నీ, యీనాడు అత్యవసరంగా తొలగించ బడాల్సినట్టిన్నీ కాలం చెల్లినట్టి కులవ్యవస్థ ముస్లింలను క్రైస్తవులను హిందూ సమాజంలోనికి లీనం చేసుకోవడానికి ప్రధానమైన అడ్డుగోడగా వుంది. ఈ సత్యం హిందువులు గుర్తించాలి. విదేశీపాలన కాలంలో ఇతర మతాలు పుచ్చుకున్న హిందువులు- ఒక విధంగా చెప్పాలంటే- రాజకీయ స్వాతంత్ర్యం పొందిన యింకా మత స్వాతంత్ర్యానికి నోచుకోని హిందువులు తిరిగి మాతృ సమాజానికి సన్నిహితులు కాకుండా వుంచుతున్నదీ, వారిని తిరిగి తమ పూర్వ హిందూ సంతతిలో కలవకుండా హిందుత్వానికి దూరం చేస్తున్నది యీ కులవ్యవస్థే- అందుకు సందేహం లేదు.

# కులతత్వం ముస్లింలలో క్రైస్తవులలో కూడా చోరబడింది!

దేశాన్ని మతానికి అతీతం చేయాలి. కొంతమంది హిందువులు మతం మారినందుకుకాదు మనం విచారించాల్సింది. ఆ కొత్త మతంవాళ్లకి మనకి మధ్య అడ్డుగోడగా నిల్వడం, వాళ్లలోవాళ్ల మనసోదరులమనే భావం చెరగిపోవడం మనకు బాధాకరంకావాలి. వారు పేర్లు మార్చుకొనడంద్వారా తాము హిందూ సంతతికి చెందనివారమని, తాము వేరని భావించడంవల్లనే నిజానికి మతానికి పేర్లు పెట్టుకోవడాన్ని సంబంధంలేదు. మతంమారినవారు అలవాట్లు మార్చుకుంటున్నారు. బొట్టు సౌభాగ్యచిహ్నం. అది మార్చాల్సిన అవసరంలేదే! వేషం మారుస్తున్నారు. టర్కీలో నిషేధించబడ్డ ఫెజ్ టోపీ పెడుతున్నారు. దీనికి మతానికి సంబంధంలేదే! నిజానికి మహమ్మదీయ మతగ్రంథాలు అరబిక్ భాషలో వున్నాయి. కాని యిచ్చటి ముస్లింలు అరబ్బీ భాషమీదనన్నా ఉర్దూమీద మమకారం పెంచుకుంటున్నారు. సుమారు యాభై ఏళ్లక్రితం ముస్లింలు స్థానికభాషనే మాట్లాడేవారు. ఆ భాషల్లోనే చదివేవారు. ఉర్దూను చరిత్రకారుల మొగల్ చక్రవర్తుల గుర్రపు శాలల్లో జన్మించిన సంకరభాష అన్నారు. మరి దానిమీద మమకారం దేనికి? హిందువులనుండి విడిగా వుండడానికి తమకో ప్రత్యేకభాష కావాలనే తాపత్రయం దీనికి కారణం. కొరానును టర్కీలోవలె స్థానికభాషల్లోకి అనువదించి ఎందుకు దేశభాషల్లో ప్రార్థన చేయరు? అల్లాకు అరబిక్ బాష తప్ప వేరేభాష రాదని అనుకుంటున్నారు. మతం మారినవారు విదేశీ భాషల పట్ల వ్యామోహం పెంచుకుంటున్నారు. విదేశీ భావాలమీద, ఆచార వ్యవహారాలమీద మోజుపెంచుకుంటున్నారు. ఈ రకంగా వీరెందుకు తమ నాగరికతను, సంస్కృతి పోగొట్టుకోవాలి? ఇదంతా తప్పని ఏ హిందూనాయకుడైన వారికేనాడైనా బాహాటంగాచెప్పాడా? మతంమారినవారు మన హిందూ సంతతేననీ, వారిని సాటి సోదరులుగా భావించి మన యిళ్లకు పండుగలకు

పబ్బాలకు ఆహ్వానించామా? "హిందూయిజం" చాలా విశాల హృదయం గలదంటారు. దక్షిణాదిన ముఖ్యంగా క్రైస్తవులలో మన కులవ్యవస్థ వాళ్ళ లోనూ చోటుచేసుకుంది. అలాంటివారితో మతం మార్చుకొని తోటి కులం వాళ్ళన్నా సహపంక్తి భోజనాలకుగాని, వారితో వియ్యమందడాన్కి గాని సిద్ధంగా వున్నారా? అలాగే భారతదేశంలో ముస్లింలుగా మారిన హిందువుల లోను విస్తృతంగా పరిశీలించినమీద కులవర్గవిభేదాలున్నట్లు ఇమ్తియాజ్ అహమ్మద్, గౌస్ అన్సారీ, ఆర్. లెవీ, నజ్మత్ కరీంవంటి వారు బాధ పడుతూ పుస్తకాలు రాశారు. 1901లో జనాభా లెక్కల అధికారి బెంగాల్లో ముస్లింలగూర్చి యిలా అన్నారు: **"ఆచరణలో బహుకులాలున్నాయి."** సాంప్రదాయికంగా మహమ్మదీయుల్లో నాల్గు ముఖ్య తెగలున్నాయి. షేక్, సయ్యద్, మొగల్, పఠాన్ అన్నవి. కాని బెంగాలులో వీటి ప్రసక్తి తక్కువ. ఇచ్చట మహమ్మదీయులు రెండు ముఖ్యమైన సాంఘిక వర్గాలను గుర్తిస్తారు. 1. అష్రఫ్ లేదా షరాఫ్లు 2. అజ్లఫ్‌లు. "అష్రఫ్ లంటే తమ పూర్వీకులు విదేశంనుండి వచ్చినవారని నమ్మేవారు, మతం మారిన అగ్రకులంవాళ్లు మతంమారిన అన్యకులాలవాళ్లు, తక్కువ వృత్తి వారు, అల్పవర్గాలు అజ్లఫ్‌లు. వీళ్లను ఇతార్, కమానా, రిజాత్ లేదా రసీల్ ఇల్లాలని కూడా అంటూవుంటారు. జనాభా లెఖ్ఖల అధికారి వీళ్లను "అధ ములు" "పనికిరానివాళ్లు" అంటూ వర్గీకరించాడు. అంతేగాక, ఆ అధికారి ముస్లింల్లో "అర్జల్" అనే మూడోవర్గం వున్నట్లు, వీరందరికంటె అధమాతి అధములనీ, ఏ ముస్లిం వీరితో కలవడని, వీళ్లను మసీదుల్లోనికి రానీయరనీ, చచ్చిన తర్వాతకూడా వీరి గోరీలు యితర ముస్లింల గోరీలవద్ద కట్టనివ్వ రనీ తన నివేదికలో పేర్కొన్నాడు. హిందువులలోలాగా వీళ్లకూడా అనేక కులాలున్నాయి. అష్రఫ్‌లతో ఆరు కులాలు, అజ్లఫ్‌లలో 36కులాలు అర్జల్‌లలో మరొక ఆరు మొత్తం 48 కులాలున్నాయి! సయ్యద్, షేక్, పఠాన్ మొగల్, మల్లిక్ మిర్జాలు అగ్రకులస్తులు అష్రఫ్‌లు. 2) పిరాలీ,

త్యాగాయ్ హిందువులలోనుండి మతం మార్చబడ్డ సేద్యం చేసుకునే అగ్ర కులాలవారు షేక్‌లు 3) దర్జీలు, జొలహాలు, పకీర్‌లు, రంగరేజ్‌లు 4) బర్హీ, భదియారాధవా, ధునియా, గద్దీ, కలాల్, కసోమ్, కులాకుంజరా, లహెరీ, మహిఫరోగ్, మల్లావివియాని కారీ 5) అబ్దల్, బాకో, బెడియా, భట్, చంచా, దఫారీ, దోభీ, హజ్జాం, మూచో, నాగర్చి, నాట్‌సన్యారియా, మదారియా, తుంతియాలేదాటుంటియాలు తక్కువకులాల వారు అజ్లిఫ్‌లు. ఇక ఖానార్, హలాల్, ఖోర్, కిర్జాకస్బి, లాల్‌బేగిమవుగ్రా, మెహ్తర్‌లు అధమ కులాలవారు అర్జల్‌లు. హిందువులలోలాగా వివాహాలు ఆయావర్గాలకే పరిమితం, కులాంతర వివాహాలు నిషిద్ధం. అన్ని ప్రాంతాల్లోనూ యిలా బెంగాల్‌లో వలెనే మహమ్మదీయుల్లో కులాలున్నాయి. "బెంగాల్ ఉదాహరణాలు మహమ్మదీయుల్లో ఒక్కకులానికేగాదు అస్పృశ్యతకూడా వుందని నిరూపించడానికి" అన్నారా జనాభా సేకరణ అధికార నివేదికలో. మరి హిందువుల్లో కనీసం ముస్లింలలోగల తమ సన్నిహిత వర్గస్తులతో కులస్తులతో కలసి భుజించడానికి గాని, వియ్యమందడానికి గాని సంసిద్ధత వున్నదా? లేదనేది సత్యం. ముస్లింలను క్రైస్తవులను దూరంగా వుంచడంలో హిందువులకు బాధ్యత లేదని అనగలమా?

శ్రీకృష్ణ చైతన్యుని ముఖ్యశిష్యుడు మహమ్మదీయ మతం నుండి మారిన హరిదాస్ ఎంత "ఇస్లామిక్ సహోదరత్వం" అని అంటున్నా ముస్లింలులంతా ఒకటిగా వుండగల్గుతున్నారా అంటే అదీ లేదు. కాని హిందువులు చైతన్యునిలాగా ముస్లింల, క్రైస్తవుల పట్ల ప్రవర్తించాలి. మతం మారంగానే దగ్గర బంధువులు కూడా వానిని దూరంగా వెళ్ళగొడ్తున్నారు. ఏదో వేరేదేవుడిని నమ్మాడులే మన సోదరుడేగా అని అతనితో మతం మారక ముందువున్న సంబంధబాంధవ్యాలు నిలుపుకొనకుండా తన్ని

తగలెయ్యడం సబబా? వాళ్ళ కులాచారాలు మనకులాచారాలతో భిన్నమని దూరం చేస్తున్నాం. అంతే. మతం కారణంగా మాత్రం కాదు. మొదట్లో శైవమతం, వైష్ణవ మతం, బౌద్ధం వగైరాలు కులతత్వాన్ని పోగొట్టాలనే ప్రయత్నించాయి. వీరశైవులకు వీర వైష్ణవులకు మతకలహాలు జరిగాయి. కాని చివరకు వాటిపై కులమే విజయం సాధించింది. హరిదాసు వైష్ణవుడైనా అతనిని ముస్లింగానే చూశారు ఆనాటి హిందువులు! అందువల్లనే మత విషయం కంగా విడినవాళ్లను చివరకు సామాజికంగా గూడా హిందువులు దూరం చేసుకున్నారు. ఈ విషయంలో మనకన్నా కులాలున్నా ముస్లింలు, క్రైస్త వులు కొంచెం మెరుగు! మనని విడదీసింది కుల కట్టుబాట్లే గాని మతం మాత్రం కాదని గుర్తించాలి.

## హిందువులలో రాజకీయ భావన లోపించింది

ఇక క్రైస్తవుల విషయానికి వస్తే వీరిలోను అనేక తెగలు, మన కులాలు వున్నాయి. క్రైస్తవ అగ్రవర్ణస్తులు చర్చిలో క్రైస్తవ హరిజనుని ప్రక్కన కూర్చొనడం కూడా చేయరు. స్థానిక క్రైస్తవ మతాధిపతి దీనిని ఆమోదిస్తాడు. అయితే ఈ విదేశీ ప్రభావానికిలోనైన స్థానిక క్రైస్తవ మతాధిపతులు క్రైస్తవ స్త్రీలను కుంకుమ పెట్టుకోనివ్వరు! ముఖ్యంగా చర్చికి వచ్చినప్పుడు (కొందరు క్రైస్తవ యువతులు యిళ్ళలో కుంకుమ పెట్టుకుంటూ వుంటారు.) చిన్న చిన్న ఆచార వ్యవహారాల్లో, ఆహార అల వాట్లలో సామాజిక వ్యవహారాల్లో యిచ్చిపుచ్చుకోవడాల విషయంలో మనం ఒకటిగా వుండలేకపోతున్నందువల్ల వారిని మరెంత దూరం చేసు కుంటున్నాం. ఇవి చిన్న విషయాలుగా కన్పించినా మనలోను క్రైస్తవుల్లోను ఒకరకమైన ఒంటరితనాన్ని, మనం వేరు అనే భావాన్ని పెంచడానికి దోహదం చేస్తున్నాయి. హిందువుల్లో రాజకీయ మనస్తత్వం లేదు. ఎంత సేపటికీ ఆహార వ్యవహారాలపట్లా, వేషభాషలపట్లా, కట్టుబొట్టుపట్ల ఆసక్తి

చూపుతారేగాని ముస్లింల్లో, క్రైస్తవుల్లో వున్నట్లు రాజకీయ మనస్తత్వం లేదు. హిందువులు హిందూదేశానికి కంటె వీటికి ప్రాధాన్యత నివ్వడం మానాలి. వాటివల్ల మనం 800 సంవత్సరాలు ముస్లిం విదేశీ పాలకుల క్రింద, 200 సంవత్సరాలు ఆంగ్లేయ పాలన క్రింద బానిసత్వాన్ననుభవించాం. స్వతంత్రం వచ్చి యిన్నేళ్ళు గడిచినా ముస్లింలను క్రైస్తవులను లీనం చేసుకోలేకపోతున్నాం. మౌల్వీ ముల్లాల కారణంగా, విదేశీ మిషనరీల కారణంగా ముస్లింలు, క్రైస్తవులు రాజకీయంగా మనస్తత్వాన్ని పెంచుకున్నారు. ముస్లింలు ముస్లింలుగా ముస్లిం ప్రయోజనాలకోసం, క్రైస్తవులు క్రైస్తవులుగా క్రైస్తవ ప్రయోజనాల కోసం సామూహికంగా ఓటుచేసే "ఓట్ బ్యాంక్" లుగా రూపొందారు. ఫలితంగా పాకిస్తాన్ యేర్పడ్డా తృప్తిపడక ఇంకా ఎక్కువ సాధించాలని ముస్లింలు, నాగాలాండ్, మిజోరాం వగైరాలతో తృప్తిపడక ఇంకా ఎక్కువ సాధించాలనీ క్రైస్తవులూ ప్రయత్నిస్తున్నారు. హిందువులు హిందువులుగా హిందూదేశ, సమాజ ప్రయోజనాలకోసం ఓటు చేసే ఓటు బ్యాంకుగామారడమన్నదే హిందూదేశసమైక్యతకు ప్రభావవంతమైనమార్గం. గతంలో మన జాతికి పునాది సంస్కృతి కావడంవల్ల నేటి ఆవశ్యకత అయిన రాజకీయ భావన అనే లోపం వచ్చి వుండవచ్చు. అలా ఓటు బ్యాంకుగా మారకపోవడం హిందువుల్లోని బలహీనత. ఈ దేశంలోని హిందువులు చేస్తున్న ఈ పాపంవల్లనే దేశం దెబ్బ తింటున్నది. హిందూ సమాజం దెబ్బతింటున్నది. ముస్లింలు, క్రైస్తవులు మనకు దూరమవుతున్నారు. క్రైస్తవ చర్చిలు (ప్రార్థనాలయాలు) హీబ్రూ, లాటిన్ కట్టడాలైనా మనదేశంలో ఈ క్రైస్తవ ప్రార్థనాలయాలు ఆంగ్లో శాక్సన్ పంథాలో వుంటాయి! మనను ఆంగ్లేయులు పరిపాలించడంవలన. వివిధ దేశాల మిషనరీలు రంగప్రవేశం చేశాక ఆయా దేశాల పంథాల్లో చర్చి కట్టడాలు వెలుస్తున్నాయి. అయితే భారతీయ పద్ధతిలో క్రైస్తవులు తమ

ప్రార్థనామందిరాలనెందుకు నిర్మించుకోరు? అలాగే ముస్లింల విషయం కూడా. దీని కారణం వారి మతం వారిని విదేశీ నాగరికతకు యేజంట్లుగా మార్చడం అనేది నిజం. విదేశీ మతం పుచ్చుకున్నవారు విదేశీ సంస్కృతికి బానిసలవుతున్నారు! విదేశీ పద్ధతుల్లో తమ ప్రార్థనాలయాలు కట్టుకొంటున్నారు. మనం మనవారికి దేవాలయాల ప్రవేశాన్ని నిషిద్ధం చేయడం (అస్పృశ్యులనే వారికి) నిరాకారుడైన దేవుని చిహ్నం చూపి తక్కువ ఆధ్యాత్మికతగల వారిని ఆకర్షించడం జరగడం లేదా? సంస్కృతం చదువరాదని నిషేధాలు పెట్టిన ఫలితంగా వారు మతం మారి లాటిన్ లేదా ఆరబిక్ భాషలపట్ల వ్యామోహం పెంచుకుంటున్నారు. ఇది సహజం. దానికి బాధ్యత హిందూ సమాజానిది కాదా? హిందూత్వమంటే భయంకల్గి స్వాభిమానరహితంగా వున్నవాళ్ళు మతం మార్చుకోగానే పేర్లు మార్చుకోవడానికి ఇదో కారణం. అందుకు మనను మనమే నిందించుకోవాలి. మనచేత దూరంగా నెట్టివేయబడ్డవారు మతం మారాక తమను శతాబ్దాలుగా దూరం చేసుకున్న సమాజాన్ని దానిసంస్కృతిని అసహ్యించుకోవడం సహజం. తమ మతానికి చెందిన సమాజాల సంస్కృతిపట్ల (సంస్కృతి సమాజాలు ఒకదానితో ఒకటి ఘనిష్ట సంబంధం కల్గి వున్నందున) మొగ్గుచూపడం జరుగుతున్నది. వివిధ పంథాల నాయకులు మన ఆధ్యాత్మికతను సాంప్రదాయాలతో ముడిపెట్టడంవల్ల తమ దైనందిన జీవితంలో సత్యదూరమైన బోధనలు చేస్తున్నందువల్ల తమను నీచంగా చూస్తున్నందువల్ల, ఈ సమాజాన్ని యిష్టపడకుండా వుంటూ ఈ సంస్కృతిని ప్రేమించడం మతం మార్చుకున్న హిందువుకు కష్టం. హిందువుల స్వార్థపూరిత చర్యల ఆధారంగా హిందూ సమాజాన్ని, సంస్కృతిని, భావాలను ఈ మతం మార్చుకున్నవారు అంచనా వేశారు. వాటి ఆధారంగా హిందుత్వాన్ని ఆ దృష్టితో చూశారే గాని, నిజమైన హిందూత్వానికీ వీటికీ సంబంధం లేదని కొందరంటున్నమాట నిజమైన హిందూత్వం ఆచరణలో హిందువుల్లో వారికి కన్పించలేదు.

హిందూమతంవల్ల ఉపయోగమేమిటి? హిందూయిజం చెప్పే గొప్ప స్తూత్రాలు ఆచరణలో లేకపోతే, హిందూతత్వం ఆచరణలో లేకపోతే అవి శాస్త్రీయంగా వున్నా వస్తు ప్రదర్శన శాలలో చూసే వింత వస్తువుల్లో ఇదొకటి అనే భావన మతం మారినవాళ్ళలో రావడం ఆశ్చర్యకరంకాదు.

**హిందువులు ప్రతి హిందువుని సోదరునిగా చూడడం, ప్రతి "ఇండియన్" అనబడే భారతీయుని హిందువుగా భావించడం జరిగి తీరాలి.** వారిని మన అన్ని సామాజిక సమావేశాలకు ఆహ్వానించాలి. మన గుడి తలుపులు వారికి తెరవాలి. వ్యక్తులను దూరంగా వుంచే సాంప్రదాయాలు విడనాడాలి. పరస్పర అవగాహనకు శ్రమతో కూడిన ప్రయత్నం మనస్ఫూర్తిగా చేయాలి. వారికి సక్రమమైన చరిత్ర చెప్పాలి. అప్పుడే విభేదాలు తగ్గి క్రమంగా వారి మనస్సులను మనం జయించగల్గుతాం. అప్పుడే వారు మనతో అరమరికలు లేకుండా కలసి వుండగల్గుతారు. ప్రస్తుతమున్న దుష్ట వాతావరణం మారుతుంది. అన్నీ మారుతాయి. వారిలో దేశభక్తి లేదంటాం కాని దానిని పోగొట్టడానికి మత మౌఢ్యం గల మౌల్వీ ముల్లాలతో బాటు విదేశ క్రైస్తవ మిషనరీలతో బాటు మనం కూడా కారకులమేనని గుర్తించాలి. సామాజిక స్పృహ లేకుండా హిందువు లనుసరించిన ఉష్ట్రపక్షి విధానంవల్లనే మనం చాలా పోగొట్టుకున్నాం. బృహద్భారతాన్ని తలచుకుంటూ మనం గర్విస్తాం. మన సంస్కృతి వ్యాపించడానికి కారణభూతమైన బౌద్ధం జపాను, చైనా, ఇండొనీషియాలో దాని ద్వీపాలైన జావా, బోర్నియో, సుమత్రాలు,ఇండొ చైనా,థాయ్‌లాండ్, కాంబోడియా, బర్మా, టిబెట్ వియత్నాంల్లో వ్యాపించి మన సంస్కృతీ పతాకాన్నెగరవేసింది. అలాంటి బౌద్ధులను యిప్పుడు మనమెలా చూస్తున్నాం, ఎలా వారిని చూడాలి? ఆఫ్ఘనిస్తాన్‌గా మారిన గాంధారంలో రష్యన్లు ప్రవేశించి వారి స్వాతంత్ర్యాన్ని హరిస్తే మనం

అచ్చటివారు మన సోదరులే, కేవలం పూర్వీకుల మతం మారిన సంతతే నని ఆత్మీయత చూపగల్గామా? చరిత్ర ప్రసిద్ధి చెందిన పురుష పురాన్ని (పెషావర్), తక్షశిలను, మన దేశానికి హిందూ దేశమని పేరు రావడానికి కారణమైన సింధును, పంచ నదీ ప్రాంతాన్ని (పంజాబ్) హింగుళీయత స్థావరమైన బలూచిస్థాన్ని మన "సోనా బంగ్లా"ను రాజకీయంగా వేరు రాజ్యాలుగా మారినా మనం వాటిపట్ల శ్రద్ధాశక్తులు హృదయంలో నిల్పు కుంటున్నామా? ఈ రోజున విరోధులుగా వున్నా వారు మన పూర్వీకుల సంతతేననే గుర్తింపు మనకు వుంటున్నదా? హిందువులు పై పేర్కొన్న వాటి దృష్ట్యా తమ లోపాలను గుర్తించి వాటిని తొలగించుకొనడానికి ప్రయత్నించాలి.

## కుల కట్టుబాట్లు ఫలితం మతం మార్పిడి

హిందూ సమాజంలో ముస్లింలుగా మారిన హిందువులలో అత్యధిక సంఖ్యాకులు అంతకు పూర్వం బౌద్ధమతం అనుసరించేవారు, బర్మా, జావా పూర్తిగా బౌద్ధ దేశాలు. లుంగీ వారి జాతీయ భూష (dress) మహమ్మ దీయులు వాడే లుంగీకి ప్రేరణ ఈ బర్మా జావా బౌద్ధ వేషమనే సంగతి గుర్తించుకోవాలి. అయితే బౌద్ధులే ఎక్కువగా మన దేశంలో ముస్లింలుగా ఎందుకు మారారో కూడా మనం గ్రహించకపోతే హిందూ సమాజం సరిగ్గా ఆత్మ విమర్శ చేసుకొని తన దోషాలను గుర్తించలేనట్లవుతుంది. బెంగాలులో హర్షునికి తర్వాత కాలంలో 11 వ శతాబ్దంలో బౌద్ధ పాల వంశీకుల పాలన భారతదేశంలో అత్యధికంగా వుండేది. వారి తర్వాత "సేన్"లో అధికారంలోకి వచ్చారు. వీరు పూర్తిగా సనాతన మతం అనుసరించే హిందువులు. అధిక సంఖ్యాక బెంగాలీలు బౌద్ధులు బల్లాల సేన్ అనే రాజు వారికి బుద్ధి గరపాలనుకున్నాడు. ఆనాడు బెంగాల్‌లో

బ్రాహ్మణులు అధికంగా లేరు. అతడు హిందూ దేశ యితర ప్రాంతాల నుండి బ్రాహ్మణులను బెంగాల్‌కు దిగుమతి చేసి "కుల" కట్టుబాట్లను అమలు జరపాలని చూశాడు. అది బౌద్ధులకు కంటక ప్రాయమైంది. ఫలితంగా ముస్లింలు బెంగాలుమీద దండయాత్ర చేసినప్పుడు ఆ విదేశీ దండయాత్రికులను హిందూ సనాతన రాజుల అణచివేత నుండి బెంగాలీ బౌద్ధులను "విముక్తి" చేయడానికి వచ్చిన వారిగా భావించి, ప్రచారం చేసి, వారికి సహాయంచేసి, వారి మతాన్ని కౌగలించుకున్నారు. (నిరంజకార్ రుష్మయొక్క సూన్య పురాణం చివరిభాగం, 232 నుండి 236 పేజీలలో. చారుచంద్ర చటర్జీ గారి బెంగాలి ఎడిషన్ బసుమతి ప్రెస్ ప్రచురణ మరియు వంగ సాహిత్య పరిషత్ ప్రచురణ ధర్మపూజా విధాన పుస్తకంలో వివరాలివ్వబడ్డాయి) బల్లాలసేన్ సదుద్దేశంతోనే చేసి వుండవచ్చు. అయితే ఆనాటి సామాన్య బెంగాలి బౌద్ధుడు బల్లాలసేన్ బ్రాహ్మణులు "ఆర్యులని" తాము కామని దానిని హిందువుల అణచివేత విధానంగా భావించారు! 11 వ 12 వ శతాబ్దాల్లో బౌద్ధుల్లో తాము అణచివేయబడుతున్నవాళ్ళమనే భావం, భయం ప్రజ్వరిల్లిన కారణంగానే వాళ్ళు ముస్లింలు కావడానికి కారణమైందన్నేది సత్యం. ఈనాడున్నట్లు ఆనాడు హిందూ సనాతన మతంవారు బౌద్ధులు తాము ఒకే హిందూ సమాజానికి చెందినవారమనే భావనగాని బౌద్ధులు హిందువులలోని భాగమేననిగాని అటు బౌద్ధులు గాని, యిటు బల్లాల సేన్ వంటి వారు గాని గుర్తించకపోవడం దురదృష్టకరం. అలాగే యీనాడు మనం ముస్లింలు క్రైస్తవులు ఒకనాడు హిందూ సమాజానికి చెందినవారనే గుర్తింపుతో "హిందూ ముస్లింలు", "హిందూ క్రైస్తవులు" యితర హిందూ మతం వాళ్ళు అందరూ హిందూ జాతీయులే అని గుర్తించాలి. నలభై ఏళ్ళక్రితంవరకూ అంటే మా చిన్నతనంలో కూడా ఈ దేశ చరిత్ర భౌగోళశాస్త్ర పుస్తకాల పేర్లు "హిందూదేశ చరిత్ర", "హిందూ దేశ భౌగోళిక శాస్త్రము" అని వుండేవి. ఈ రోజున భారత్ అనడం "ఫ్యాషన్"

"హిందూ" అనడం "సంకుచితం" అనే వాతావరణం నిర్మాణమయింది. భారత్ పేరు హిందూ పేరు కాదు. రెండూ ఒకటే. "హిందు" అనేది మత పర శబ్దం కాదు-జాతి లేదా రాష్ట్ర సూచిత పదం.

నిజానికి బైజంటియంలోని గ్రీక్‌లు, క్రైస్తవులు దండయాత్రచేసిన లాటిన్ క్రైస్తవులచే బెంగాలులోని బౌద్ధులు హిందువుల చేతుల్లో పడ్డ బాధలు పడలేదు. తమ ఉనికికే ప్రమాదమని గుర్తించిన లాటిన్ క్రైస్తవులు లాటిన్ చర్చి, తురుష్కుల దాడుల నుండి రక్షణ యివ్వడానికి అంగీకరించినా లాటిన్ చర్చి, యొక్క దాడి విదేశీ ప్రమాదంగా గుర్తించిన గ్రీకులు పోపు కావలకన్నా మహమ్మద్ తలపాగాయే మంచిది" అన్నా రాసాడు. అలాగే ఆటవిక ఆఫ్ఘన్‌నులు నాగరిక హిందువులకన్నా మేలు అన్నారు బౌద్ధ మతం అనుసరించే బెంగాలీ బౌద్ధులు! 'కుల' వ్యవస్థ గల హిందూ సమాజంలో అస్పృశ్యులుగా వుండడంకన్నా కుల వ్యవస్థ లేదని ప్రచారం చేయబడుతున్న "ఇస్లాం"లో చేరడమే మేలనిపించింది బెంగాలీ బౌద్ధులకు. "విశ్వ హిందూ" భావం, "వసుధైక కుటుంబ" భావం మంచిదే. ఆచరణలో హిందూ సమాజంలో యిది వాస్తవికంగా లేదు. ముస్లింలు క్రైస్తవులు యిచ్చటి సంస్కృతిని గౌరవించడం లేదని వారిని విమర్శించేముందు మనం మన సంస్కృతిని సరిగా అనుసరిస్తున్నామా? గౌరవిస్తున్నామా? అని ఆలోచించుకోవాలి. సాధారణంగా తురుష్క ముస్లింలు నేను ముందు టర్కీవాడిని, తరువాత ముస్లింను అనుకుంటున్నట్లుగా ఇచ్చటి హిందువులు ముందుగా నే హిందువును తర్వాతనే నా మతం, నా కులం వగైరాలు అనుకుంటున్నారా? భారత జాతీయత అంటాం గాని అదే హిందూ జాతీయత అనం. వికసిత రాష్ట్ర ప్రజలలో ఉండవలసిన జాతీయ భావనా తీవ్రత మనం చేసే ప్రతి పనిలో ప్రతిబింబిస్తున్నదా? బెంగాల్లోని తిప్పెరా జిల్లాలో చాంద్‌పూర్ సంధలి పురానా బజార్‌లో గౌర్‌నితాయ్ దేవాలయం

వుంది. 1938, 1939 లో అప్పుట గలాటాలు జరిగాయి. అప్పటికి సాహోలు, కుందూలు అని రెండు కులాలవాళ్ళున్నారు. ఆ దేవాలయంలోకి సాహోలకు బ్రాహ్మణుడు పనిచేసే బ్రాహ్మణుని తక్కువగా భావించి గుడిలోకి రానివ్వనందువల్ల ఆ గలాటాలు జరిగాయి! అలాగే దక్షిణాదిని అయ్యంగార్ బ్రాహ్మణులు సంస్కృత మంత్రాలకు ప్రాధాన్యత నివ్వాలా తమిళ మంత్రాలకా అని మీమాంసలోపడికొట్టుకున్నారు! నామం నిలువుగావుండాలా అడ్డంగా వుండాలా అని అయ్యర్లు అయ్యంగార్లు మేం అధికులమంటే మేం అధికులమని వివాదాలు పడ్డారు. దేవుడి నామానికి పాదం వుండాలా, వుండకూడదా అనే వివాదాన్ని ఇంగ్లండులోని పీవికౌన్సిల్ జడ్జీలు యిప్పుడు వెంకటేశ్వర స్వామి కళ్ళమీద కూడా నామం వచ్చేటట్లు చేయడం ద్వారా ఉభయవర్గాలను సంతృప్తి పరచేటట్లు తీర్పుయిచ్చి పరిష్కరించారు! ఇలాంటి ఉదాహరణలు కోకొల్లలు. రాయికి మొక్కుతారు. పాముకు పాలు పోస్తారు. పరమాత్మ అంతటా వుంటాడని, అందరిలోని ఆత్మ ఒకటే అనీ ఉన్నత ఆదర్శ ఆధ్యాత్మిక విషయాలు చెబుతూ, సాటి మానవుని కులం పేరుతో అంటరానివాడుగా దూరంగా వుంచుతాం. ఎంతటి వికృతి! దేశ ప్రగతికన్నా, సమాజాభివృద్ధికన్నా యివి ముఖ్యమా? జిన్నా మొదలైన వారు దేశం విభజిస్తే మనం-అంటే హిందువులం హిందూ సామ్రాజ్యాన్నే ఛిన్నాభిన్నం చేయడంలేదా? దేశవిభజనకు కారకులైనవారు, దేశవిభజన కోరేవారు ఎంత దేశద్రోహులో, అడుగడుగునా సమాజ విచ్ఛిన్నతకు దోహదంచేసే పనులుచేసే హిందువులు కూడా వారికన్నా దేశద్రోహులే ననడంలో తప్పులేదు.

బూజుపట్టిన కులాలు మనం ఒకే జాతిగా రూపొందడానికి అడ్డువస్తున్నాయి. ఆధ్యాత్మిక పేరుతో, కర్మ సిద్ధాంతం పేరుతో అకర్మణ్యత, అలసత్వం, అహింస పేరుతో పిరికితనం, మతంపేరుతో

ప్రత్యేక వర్గాలు ఏర్పడడం-యివి మనను క్రుంగ తీస్తున్నాయి. ఆదర్శాలు వల్లిస్తాం. ఆచరణ పూజ్యం.

జననీజన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసి అంటాం. దేశమంటే మట్టికాదోయ్-దేశమంటే మనుషులోయ్ అంటాం. కాని ఆ జన్మభూమిలోని మనుషులనే హిందువులలో కొందరిని అస్పృశ్యులంటూ వారి జీవితాలను నరకప్రాయం చేశాం. చేస్తున్నాం. హిందువులు, విద్యాధికులైన హిందువులు ముఖ్యంగా ఆలోచనలో, ఆచరణలో అంతరాన్ని చూపేవారిగా తయారయ్యాం. కులాన్నడ్డుపెట్టుకుని "కర్మ" సిద్ధాంతంపేరుతో దోచుకొనడం చేస్తున్నాం. మనం చేసిన ఈ పొరపాట్లకు, ఈ తప్పుడు ప్రవర్తనకు, తప్పుడు విధానాలకు చాలా మూల్యం చెల్లించాల్సివచ్చింది - 'పాకిస్తాన్' రూపంలో. అయినా మనకు బుద్ధిరాలేదు! అవే తప్పుడుమార్గాలు మన స్తత్వం యింకా హిందువులు అంటిపెట్టుకున్నారు.

ఇంగ్లండు, జర్మనీ, జపాన్, అమెరికా, రష్యా, చైనా వంటి దేశాలు తమ ప్రధాన విషయాలను, ప్రయోజనాలను గురించి ఆలోచిస్తుంటే మనం యింకా చిన్నచిన్న విషయాలను గురించి తాపత్రయపడుతున్నాం. వాళ్ళు అణుశక్తిని గురించి, గ్రహాంతరయానాలను గురించి ఆలోచిస్తుంటే, మనం ధర్మశాల నిర్మాణం, మఠాల నిర్మాణం గురించి ఆలోచిస్తున్నాం! వాళ్ళు చరిత్ర నిర్మిస్తుంటే మనం హిందూ వ్యతిరేక అంటే జాతి వ్యతిరేక రాజ్యాంగ వ్యతిరేక బిల్లులకు నిరసన తీర్మానాలు మాత్రం చేయగల్గుతున్నాం. వాళ్ళు ప్రపంచాన్ని నడిపిస్తుంటే మనం యింకా హిందూ-ముస్లిం-క్రైస్తవ పేరులతో సతమతమవుతున్నాం. ఈ చిన్న సమస్యలను ఒకేసారి కడసారిగా మనం పరిష్కరించుకోవాలి. ఎలా పరిష్కరించాలో ఆలోచిద్దాం.

హైందవేతరులకి మనం గతంలో చేసిన పాపాలవల్ల కొన్ని (grivences) ఆరోపణలు వున్నమాట యదార్థం. ఒకప్పుడు వర్ణవ్యవస్థ లేదా కుల వ్యవస్థ అనేది సమాజం సక్రమంగా నడపడం కోసం కార్య విభజనగా యేర్పడి సమాజానికి మేలు కలిగించివుండవచ్చు. కాని ఆనాడు యీ వ్యవస్థలో ప్రస్తుతం వున్నట్టు (regidity) మార్పుకు వీలుకాని కాఠిన్యత లేదు. ఇందుకు మనకు మన చరిత్రలో కోకొల్లలుగా ఉదాహరణలు లభిస్తాయి. ఒకే రుషికి ఒకే భార్యవల్ల కల్గిన పుత్రులు ఒకరు బ్రాహ్మణులు కాగా మరొకరు క్షత్రియులో వైస్యులో శూద్రులో అయిన సంఘటనలున్నాయి. రాహుల్ సాంకృత్యాయన్ రాసిన 'గంగ నుండి ఓల్గాకు' అన్న పుస్తకంలో ఉదాహరణలు ఎన్నో చెప్పారు. హీనకులజురాలైన అరుంధతి బ్రాహ్మణత్వం పొందింది. క్షత్రియుడైన విశ్వామిత్రుడు మహర్షి అయి బ్రాహ్మణుడైనాడు. యిలా ఉదాహరణ నివ్వాలంటే మహాభారతమంత గ్రంథం రాయవచ్చు! కాని ఏనాడు మారిందో తెలియదుగాని మన వర్ణ, కుల వ్యవస్థలు (regid) మొండిగాను, దేనికది ప్రత్యేకమైన గదుల్లా మారి ప్రజలనుమార్చి యీనాడు హిందూ సమాజానికి పునాదిగా తయారయ్యాయి. మనం ఆధునిక నిర్వచనం ప్రకారం వికసించిన జాతిగా రూపొందడానికి పెద్ద అడ్డంకిగా తయారైనాయి. వాటివల్ల యీనాడు సమాజానికి కించిత్ మాత్రపు ఉపయోగం లేదు. కేవలం పెళ్ళి విషయంలోను, ఉద్యోగుల విషయంలోను తప్ప వాటిని ఉచిత రీతిన పాటించడం కనబడకపోయినా హిందువుల్లో ఐకమత్యత, సోదరభావం పెంపొందడానికి అడ్డుగోడలై నిలిచాయి. ఈ ఇనుప చట్రంలాంటి సాంఘిక దుష్ట వ్యవస్థను ముందు మనం బ్రద్దలు చేయాలి. మనలో లోపాలు దాచుకుని ప్రయోజనం లేదు. గత అనుభవాలు మనకు దారి చూపాలి. మళ్ళీ హిందువులు గతంలో చేసిన పొరపాట్లు చేయరాదు. మన పొరపాట్ల ఫలితంగా 1000 సంవత్సరాల బానిసత్వం అనే శిక్షను అనుభవించాం. ఈ శిక్ష చాలు. ఈ పరిస్థితుల నిలా వుండనివ్వరాదు. కొనసాగనివ్వరాదు!

# 3

ఈనాడు దేశంలో రెండు రకాల భావాలు కలవారున్నారు. ఒకరు భారతదేశం అనాది నుండి ఒకే దేశంగా, జాతిగా, రాష్ట్రంగా వుంటూ వచ్చిందని భావిస్తారు. మరొకరు భారతదేశం ఎప్పుడూ ఒకే దేశం కాదు, ఒక జాతి కాదు, ఒక రాష్ట్రం (nation) కాదు అని భావిస్తారు. కాని ఇద్దరూ ప్రస్తుతం మన రాష్ట్రంలో ఒక చక్కని జాతికి వుండాల్సిన లక్షణాలు లోపించాయని అంగీకరిస్తారు. అనాది నుండి వచ్చే జాతిలో వీరంతా ఎలా జీర్ణించుకోబడాలి అని భావించే వారికీ, హిందువులు, ముస్లింలు, క్రైస్తవులు మొదలగు వారందరినీ కలిపి ఎలా నూతన జాతిగా రూపొందించుకోవాలి అని భావించేవారికీ కూడా ఈ కఠిన సమస్యకు పరిష్కారమార్గం స్పష్టంగా గోచరించడం లేదేమోననిపిస్తుంది. భారత ప్రభుత్వమే ఒక సమైక్యతా సంఘాన్ని వేసి, జాతీయ సమైక్యత (National integration) ఎలాగో తెల్సుకోవాలని తంటాలుపడి ఆ ప్రయత్నాన్ని విరమించింది.

హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, తదితరులు అంతా ఒకే జాతిగా రూపొందాలి. అందుకు మనకు పెద్ద అడ్డుగోడగా కనిపిస్తున్న అనేక విషయాలలో మతం ఒకటి.

## మతం అంటే...

మతం అనేది మానవునికీ, దేవునికీ మధ్యగల సంబంధం. దీన్నే వివరించాలంటే- తన ఆధ్యాత్మిక అభివృద్ధికి, ముక్తికి, మనిషి అనుసరించే మార్గం. (అది భగవంతుని పూజించే పూజా విధానం, ఆరాధనా విధానం). ఈ విధంగా చూస్తే మనం అనుకునే మతాచారాలు, సాంప్రదాయాలు,

తర్కం మొదలైనవన్నీ మతం కాదు. మతంలో చెప్పబడే ఆత్మకు (పరమాత్మకు) వీటితో ఏలాటి సంబంధం లేదు. మతం అనే భావన మాత్రం, నిత్యం మార్పు చెందకుండా అలాగే వుంటుంది. దాని చుట్టూచేరే ఆచార, వ్యవహారాలు, చట్టాలు, నీతిసూత్రాలు, తత్త్వము, ప్రజల జీవితానికి సంబంధించిన అనేక అంశాలు చారిత్రక, భౌగోళిక విలువలనుబట్టి మారుతూ వుంటాయి. తన మతములో ఫక్తు మత సంబంధమైనదానిని - అంటే వ్యక్తిగత ఆత్మకు, దైవానికిగల సంబంధపు భావనలను - వదులుకోమని ఏ మనిషినైనా అడగడం దైవదూషణమే కాగలదు. కనుక మనం (ఒకే రాష్ట్రంగా రూపొందడానికి) ఆ మార్గాన్ని ప్రయత్నించవద్దు. క్రీస్తు చెప్పిన మార్గాల ద్వారా మోక్షమును పొందడమనే విశ్వాసాన్ని విడిచిపెట్టమని ఏ భారతీయ క్రైస్తవుని అడగవద్దు. అలాగే మహమ్మద్ ప్రవక్త చెప్పిన దేవుని యందలి నమ్మకాన్ని వదలిపెట్టమని ఏ ముస్లింలోనూ చెప్పం. అలాగే శైవులనుగాని, శిక్కులనుగాని, వైష్ణవులనుగాని, జైనులనుగాని, శాక్తేయులనుగాని, బౌద్ధులనుగాని, ఈ భూమిలో ఏ తెగకు చెందిన ప్రజనైనా సరే మీ మతంలోని ధార్మిక జ్ఞానంలో కించిత్తైనా వదలిపెట్టుకోమని చెప్పం.

మనం వారిని అడిగేదల్లా ఒక్కటే - మతాన్ని దానికి సంబంధించని ప్రాపంచిక విషయాలతో ముడిపెట్టవద్దని మాత్రమే. మతాన్ని దానిస్థానంలో దానినుంచి ఎలా గౌరవించాలో తెల్సుకుంటేచాలు, దానివల్ల మన ఆత్మలు హాయిగా వుంటాయి. అలాగే భారతదేశము, యావత్తు ప్రపంచముకూడా సుఖంగా వుంటాయి.

మనం తరుచూ "మతం"అని అనుకుంటూ దానికి యెంతమాత్రము చెందనివి, అపార్థం చేసుకోబడుతున్నవి రెండు వున్నాయి - ఒకటి రాజకీయాలు, మరొకటి సంస్కృతి.

భారతదేశంలో సైతం చాలా కొద్దిమందికి మాత్రమే మత ప్రవృత్తి, అనుభవం వున్నాయి. మతాన్ని గురించి వినడంవల్లా, కొన్ని గ్రంథాలు చదవడంవల్లా తమకా అనుభూతి వుందని చాలామంది అనుకుంటారు. అలాటివారు మతం అనుకునేది కల్పన, తత్త్వము, సంస్కృతికి సంబంధించింది మాత్రమే. జాతి జీవితంనుండి సంస్కృతిని వేరుపర్చడం కష్టం. రాజకీయ ఆలోచనలకు కేంద్రం జాతి కనుక రాజకీయ వాద ప్రతివాదాల్లోకి యిలా మతాన్ని అపార్థం చేసుకున్నవాళ్ళు జొప్పిస్తూ వుంటారు

## హిందూ ''మతం'' అనేది లేనేలేదు

హిందువులను గూర్చి చెప్పాలంటే ఎంతోవుంది. "హిందూమతం" అనబడేది ఒకటి లేదు. హిందువులందరికి ఒకే ఒకటిగా వున్న మతంగాని పూజావిధానం గాని లేదు. అయితే హిందువుల నందరిని ఒకటిగా చేసిందీ, చేసేదీకూడా మన మాతృభూమి యగు భారతదేశపు సంస్కృతే.

అయితే మన మహమ్మదీయ, క్రైస్తవ సోదరులు ఒక విషయం బాగా తెలుసుకోవాల్సి వుంది. వారికి సాధారణంగా సమంగా వున్నది ఒకే ఒక మతవిశ్వాసం-మోక్షానికై చెప్పబడిన మార్గం. ప్రపంచానికి సంబంధించిన యే విషయాలు, తెగలు తెగలుగా తమకున్న అభిమానాలు, దీనిని ఏమీ చేయజాలవని వారు గ్రహించాలి. అందువల్ల వారు ప్రపంచ మందలి మనుష్య సముదాయములో తమ జాతి యేదో ఆ ప్రత్యేక జాతి గానే భావించుకోవాలికాని మేము క్రైస్తవులమనీ, మహమ్మదీయులమనీ అనుకోకూడదు. హిందువుల జాతికి చెందిన ఈ దేశపు క్రైస్తవులకు, మహమ్మదీయులకు హిందువుల రాజకీయాలు, వారి రాజకీయాలు ఒక్కటిగానే వుండాలి. మతము-ముసల్మాను, క్రైస్తవ, వైదిక, శైవ, బౌద్ధ, వైష్ణవ, నాస్తిక యే యితర మత విషయమైన ఊహలైనాసరే అవి వ్యక్తిగతమైనవిగానే వుండాలి.

ఇటీవల జరిగిన మత సంఘర్షణల దృష్ట్యా ఈ విషయాన్ని పరిశీలిద్దాం. లోగడ మహమ్మదీయులకు తగినన్ని అవకాశాలను యివ్వక ఈ విషయమై యెంతోకాలాన్నీ శక్తినీ వృధా పుచ్చినందులకు మనమే ముఖ్యంగా బాధ్యులమని అంగీకరించాలి. కలకత్తా కార్పొరేషన్‌లోగాని, విశ్వవిద్యాలయంలోగాని, ప్రభుత్వ కార్యాలయాల్లోగాని మరే యితర తావుల్లోగాని ఉద్యోగం పొందడానికి సమమగు అర్హత, యోగ్యతగల ఒక హిందువుకువలె ముసల్మానునకు కూడ హక్కు వున్నదనే విషయం ఎవరూ కాదనరు. అయితే ఆ హక్కును అతను ముసల్మానువలెగాక ఒక భారతీయుడుగ పొందాలి. ఆ హోదాగూడా 'అతను ముసల్మాను కనుక' యివ్వబడకపోవడం గాని, పోటీగా దరఖాస్తు పెట్టినవ్యక్తి 'హిందువు కనుక' అతనికివ్వబడడంగాని జరుగకూడదు. అది పొందడానికి మిక్కిలిగా అర్హత ఎవరికున్నదో ఆ 'భారతీయుని'కే యివ్వబడాలిగాని అనర్హునకు గాదు. ఒక వ్యక్తియొక్క యోగ్యతలను, అర్హతలను, ఘనతను నిర్ణయించేటప్పుడు ఆ వ్యక్తికి సంబంధించిన మన కవుపించని విషయాల ప్రసక్తి (అతను ఏ దేవుని ఎలా పూజిస్తాడు వగైరా) ఎంతమాత్రం తేకూడదు.

ప్రత్యేక నియోజకవర్గాల కేటాయింపు, ఉద్యోగాలకు ప్రత్యేక నియామకం, తుదకు ప్రత్యేక జాతీయ భూభాగం అనేవి మతాన్ని రాజకీయాలతో ముడిపెట్టడంవల్ల చేసిన తప్పులే. ఇవి క్షమించరానివి. "భారతీయులలో కొన్ని కోట్లమందికి భగవంతుడంటే ఒక ప్రత్యేక భావన వుంది కనుక, మిగతావారికి ఆ భావం లేదు కనుక, భగవంతునిగూర్చి ఒకేభావం వున్న భారతీయులు రాజకీయంగా, ప్రాదేశికంగా ప్రత్యేక జాతులుగా తయారవాలి" అనే తర్కమే పాకిస్తాన్ కోరడం వెనకాల వుంది. (అలాగే సిక్కిస్తాన్, నాగాలాండు, ఝార్‌ఖండ్, ద్రవిడస్తాన్ మొదలగు కోరికలు కోరేవారి వెనకాల వున్న భావనకూడా యిదే.)

అయితే భగవంతునిగూర్చి మనకుగల ప్రత్యేక భావం ఈ ప్రపంచంలో ప్రత్యేక రాజకీయకూటముల నెందుకు ఏర్పరచాలి? అలాగే మనము భౌతికమైన పదార్థములయెడల మనకుగల అభిప్రాయాలు, సూత్రాలు ఆధారంగా ప్రత్యేకవర్గాలుగా తయారు కాము. భూమి గుండ్రంగా వుందని నమ్మేవాళ్ళు, కాదు- చదునుగా వుందని నమ్మేవాళ్ళు తలొకదారినీ ఓటుచేసి రెండు జాతులవుతామా? అలాగే హోమియోపతీ వైద్యం మంచిదనేవాళ్ళు, కాదు, అల్లోపతి వైద్యం మంచిదని నమ్మేవాళ్ళు అనే రెండు జాతులుగా వుండాలని వాదిస్తామా? ఇలాంటి వాదనలు నవ్వులాటలుగా వుంటాయి. అయితే ప్రత్యేక సీట్లు కేటాయించడం, ప్రత్యేక నియోజకవర్గాలు, ప్రత్యేక ప్రాంతం దేశంగా కావాలని కోరడంకంటే మాత్రం పై వాదనలు నవ్వులాటలుగా లేవు. హాస్యాస్పదంగా లేవు.

ఇదివరకు కొంతమంది తమకున్న విజ్ఞానంమీద ఆధారపడిన భావాల వల్ల, ప్రభుత్వాధికారులవల్ల అనేక బాధలకు లోనయ్యారు. అయితే ఆ రోజులు పోయాయి. అనేక నాగరిక దేశాలలో మతం పేరిట రాజకీయాలతో ఒకరి నొకరు ద్వేషించుకునే రోజులుకూడా పోయాయి. భారతదేశంలో కూడా అవి పోవాలి.

మతం అంటే భగవంతునిగూర్చిన సామాన్య నమ్మకం. మహా చేస్తే ఈ ప్రపంచమునకు అతీతంగా భావాలుగల కొద్దిమంది మహాత్ములతో సానుభూతి కల్గిస్తుంది. అయితే, ఒక జాతిని నిర్మించే వాటిలో దాన్ని ఏ విధంగానూ చేర్చకూడదు. "మతం పేరుతో ఏ విభేదాలు వుండకూడదు. మతంపేరిట ఏ వర్గాలు, ఏ పార్టీ వుండకూడదు" అనే సిద్ధాంతం నేటి హిందూ దేశంలో ప్రచారం కావాలి. మనందరికీ ఒకే విధమైన నమ్మకం లేదే అని వాపోవడంకంటే భారతజాతిని ఒకటిగా చేసుకోవడానికి ఆధారంగా వుండగల ఒకే విధమైన ప్రయోజనాలు, ఆశలు, ఆకాంక్షలు చాలా వున్నాయని గుర్తించాలి.

## సంస్కృతి - ఏకతా సూత్రం

రాజకీయాలకు నిజమైన "మతం" భావన యెలా దూరమో అలాగే సంస్కృతికూడా అది దూరంగానే వుంటుంది. మహమ్మదీయులు జరిపే అత్యాచారాలను వ్యతిరేకిస్తూ హిందూ నాయకులు "మనం మన సంస్కృతిని రక్షించుకోవాలి" అంటున్నారు. అలాగే మహమ్మదీయులు తమ ప్రత్యేక సంస్కృతినిగూర్చి నొక్కి చెబుతూ దాన్ని కాపాడుకోవాలంటున్నారు. ఈ సందర్భంలో మనకు వారికి ఒక భేదం వుంది. మహమ్మదీయులను మహమ్మదీయులుగా చేసింది వారి "మత" విశ్వాసం కాని సంస్కృతికాదు. కాని సిక్కు, జైన, బౌద్ధ, వైదిక, శైవ, వైష్ణవ, శాక్తేయ మొదలగు వివిధ మతాలు కాకుండా సామాన్య సంస్కృతే మనలను హిందువులను చేసింది. **ఇస్లాం ఒక మతము; కాని హిందుత్వము మతంకాదు. క్రైస్తవము కూడా ఒక మతమే.**

ఒక ప్రత్యేక మతాన్ని అనుసరించేవారియొక్క సంబంధం ఆధ్యాత్మిక అనుభూతిలోనే-అంటే భగవంతునిగూర్చిన విషయాల్లోనే వుంటుంది. కనుక భాష, సారస్వతం, కళలు, వాస్తు మొదలైన వాటిని అంతగా పట్టించుకోకూడదు. తమకున్న యితర విషయాలన్నింటికన్న ఎక్కువగా హిందూదేశంలోని జాతీయ సంస్కృతిని నెత్తిన పెట్టుకొని గౌరవించాలి. అంతేకాదు. దానిలో భాగస్వాములుగా వుండడం మాత్రమేకాదు, అది తమ సంస్కృతికూడా కనుకను, తమ మాతృభూమికి చెందిన ఏకైక సంస్కృతి కనుకను, ముస్లింలు, క్రైస్తవులు దీన్ని ఆరాధించాలి. దీనివల్ల వాళ్ళకు పోయేదేమిటి? వాళ్లు పోగొట్టుకునేదేమీలేదు. ఇలా వుంటూనే వాళ్లు భారత క్రైస్తవులుగ, భారత ముస్లింలుగ వుండవచ్చు. అంతేకాదు, ముందు ముందు ఇదివరకుకంటె యెక్కువగా 'భారతీయుడు'గా వుండవచ్చు. ఇందులో

యెంతమాత్రం మతప్రసక్తిరాదు. పరంపరానుగతంగా వచ్చే సంస్కృతిను చదవకుండా ప్రపంచ సంబంధమైన కళలు వగైరా వదలిపెట్టి భగవంతుని గూర్చిన సమ్మతం మాత్రమే పట్టుకుని ప్రేళ్ళాడుతుంటే ముస్లింలు, క్రైస్తవులు అలాగే శిక్కులు, బౌద్ధులు వగైరాలలో భారత జాతీయతే తక్కువవుతుంది.

ప్రపంచంలో అన్ని సంస్కృతులకు ప్రత్యేకమైన గొప్పతనం వుంది. అయితే ప్రతి గొప్పజాతికి ప్రత్యేక సంస్కృతి వుంది. ప్రతి జాతీ తమ ప్రత్యేక సంస్కృతిని ప్రేమిస్తుంది. మనది భారతీయమైనది కనుక మన సంస్కృతిని మనం ప్రేమిస్తాం. ప్రపంచంలో గొప్ప సంస్కృతులు ఎన్నో వున్నాయని మనం అంగీకరిస్తాం. అయితే అవి మనవి కావు. మన దైనదాన్నే మనం ప్రేమిస్తాం, ఆరాధిస్తాం. అంతేకాకుండా మన సామాన్య సంస్కృతీ నిధికి ముస్లింలు, క్రైస్తవులు చేకూర్చిపెట్టిన విశిష్టతను మనం కాదనం. ఉదాహరణకు కుతుబన్, మన్‌ఝున్, మాలిక్ మహమ్మద్ జోయాషి, కబీర్ మొదలగు ముస్లిం కవుల పద్యాలన్నీ హిందూస్తానీవే. కలీం, రాషన్ వారి యితర సమకాలికుల రచనలు అట్టివే. మనం వాటిని చూచి గర్విస్తాం. వారి భావాలు, వారి శైలి మన దేశీయ సారస్వతానికి నిండుతనం చేకూర్చాయి. మననిగురించి వారు యెరుగున్నంతగా హిందువులు వారినిగూర్చి తెలుసుకోనందుకు చింతించాలి. హిందువులు వారిని గూర్చి తెల్సుకోవాలి. అలాగే ఫతేపూర్ సిక్రీని, ఆగ్రాకోటను చూచి మనం గర్వపడతాం. చాలా గొప్ప అందాన్ని పొందుపరచుకున్న భారతీయ వాస్తుశాస్త్ర పటిమకు యివి నిదర్శనాలు! ముస్లిం మతస్థులకు కట్టియిచ్చినవే అయినా భారతీయతను ప్రతిబింబింపచేస్తూ, భారతీయ శాస్త్రజ్ఞులు కట్టిన ఈ గొప్ప కట్టడాలను చూసి మనం గర్వించినట్లుగా మహమ్మదీయ సోదరులు భువనేశ్వర్, పూరీ, మధురా, శ్రీరంగం మొదలగు పుణ్యక్షేత్రాల

లోని ఆలయ కట్టడాలను చూసి (హంపీ శిథిలాలలోని కట్టడాల గొప్పదనాన్ని చూసి) గర్వపడాలి. మన దేశంలో ఏ భాషలో వెలువడ్డా వారి గ్రంథాలను వారు ఎలా సగర్వంగా గౌరవిస్తారో అలాగే సంపూర్ణ భారత సాహిత్యాన్ని అంటే సంస్కృతము, ఇతర భారతీయ భాషల వాఙ్మయములతో సహా మన యావత్తు సాహిత్యాన్ని సగర్వంగా చూడాలి. భారత దేశంలో తమ మతస్థులచే భారతసృష్టిని శోభాయమానం చేసినవాటినెలా మెచ్చుకుంటారో, గౌరవిస్తారో అలాగే (ఏ మతస్థుడైనాసరే) ప్రతి భారతీయ చిత్రకారుడు, రచయిత, గాయకుడు, శిల్పి, నాట్యాచార్యుడు, నిర్మాత, విజ్ఞానవేత్త, పాటకుడు మొదలగువారిని, ప్రతి రంగంలోను అందాన్ని, సత్యాన్ని సృష్టించిన ప్రముఖులను ముస్లింలు, క్రైస్తవులు, బౌద్ధులు, జైనులు అందరూ గౌరవించాలి.

## గ్రీసు ఉదాహరణ

క్రొత్తగా క్రైస్తవులుగా మారిన గ్రీకులు గ్రీకు దేవపు అత్యద్భుత శిల్పాలను గౌరవించని రోజులు ఒకప్పుడు యూరోపు ఖండంలో వున్నాయి. 5 వ శతాబ్దంలో క్రైస్తవులు గ్రీకు కట్టడాలను శిథిలం చేశారు. మొదట్లో క్రైస్తవమతం పుచ్చుకున్న తమ దేశీయులు తమలాగే క్రైస్తవమతం అనుసరించేవారు చేసిన ఈ చెడుపనుల గురించి ఉన్న ఉద్రేకానికి ఈనాటి గ్రీకు క్రైస్తవులు చింతిస్తారు. హెలెనిక్ (క్రైస్తవ) మత పిచ్చిని నిరసించడంలోనూ, ప్రాచీన సంస్కృతిని, పురాతన గ్రీకు దేవాలయాలను (అంటే క్రైస్తవులవి కానివి) భద్రపరచడంలోను వారు తమ ధనాన్ని, శక్తిని ఉపయోగించడంలో ప్రప్రథములు. సాధ్యమైనప్పుడల్లా తోటి క్రైస్తవులు మొదట్లో నాశనం చేసినవాటిని మళ్ళీ కడుతున్నారుకూడా. ఈ విషయంలో ఆ చిన్న గ్రీకు దేశంనుండి ఈ మన పెద్ద భారతదేశం పాఠం నేర్చుకోవాలి. ఇప్పుడున్న మతపిచ్చిపట్టిన రోజులు పోవాలి. ఆ పిచ్చి ఇప్పటికీ

చాలాకాలం మనని పీడించింది. మహమ్మదీయ మతరీత్యా "కాఫిర్లు"అయిన హిందువులు నిర్మించిన సుందరమైన జాతీయమైన ఎన్నో విలువ కట్టలేని కళా నిలయాలను గతంలో తమ మతస్తులు నాశనం చేశారనే భావమునకు చింతిస్తూ, మనఃపూర్తిగా బాధపడుతూ గ్రీకులోని నేటి క్రైస్తవులవలె, నేటి భారత ముస్లింలు, క్రైస్తవులు ప్రవర్తించాలి. ప్రఖ్యాతమగు సోమనాధ దేవాలయం, లేదా కాశీలోని విశ్వేశ్వరాలయం వంటి కళాలయాల పునర్నిర్మాణానికి నేటి భారత ముస్లింలు పూనుకోవాలి. గ్రీకు దేశంలో నేటి క్రైస్తవులు తమ పూర్వులైన క్రైస్తవులు నాశనం చేసిన "పార్థినో" కళాలయ మరమ్మతుకు కృషిచేసినట్లుగా, గతంలో యిక్కడ ముస్లింలు నాశనంచేసిన వాటిని తిరిగి నిర్మించడానికి జాతీయభావంతో, వాటిపై గౌరవంతో, నేటి ముస్లింలు ముందుకు రావాలి. **ఇది జరిగిననాడు హిందూ, ముస్లిం సమస్య యెంతమాత్రం వుండదు మనమంతా భారతీయులుగానే వుంటాం.**

ఎక్కడోవున్న క్రైస్తవ గ్రీసుదేశాన్ని గూర్చి యెందుకు? మన హిందూ దేశానికి దగ్గరగావున్న టర్కీ, పర్షియా దేశాల్లో వెల్లువిరిసిన జాతీయత ముందు మూఢమైన మతతత్వం తలవంచుకునేవుంది గదా!

## టర్కీ ఉదాహరణ

టర్కీ, పర్షియాలు పక్కా ముసల్మాను దేశాలన్న విషయం అందరికీ తెలుసు. అక్కడ అత్యధిక సంఖ్యాకులు ముస్లింలే. అయినప్పటికీ ఆ దేశాల్లోని ముస్లింలు వారి మతం పట్లా, రాజకీయాల పట్లా, సంస్కృతిపట్లా ఎట్లా ప్రవర్తిస్తున్నారు? మన భారత ముస్లింలలో ఎక్కువమంది మన సంస్కృతి పట్లా రాజకీయాలపట్లా అనుసరించే విధానానికి టర్కీలో, పర్షియాలోని ముస్లింలతో పోలుస్తే ఎంతో తేడా వుంది! టర్కీలోకల్లా ముస్తఫా

కెమల్ ఆటాటర్క్ (కెమల్ పాషా) గొప్ప జాతీయనాయకుడు. "ముసల్మాను లందరిలోనూ మిన్న" అని మహమ్మదాలీ జిన్నాయే అతనిని పొగడాడు. మనం భారతదేశంలోని ముస్లింలు ఏదిచేయాలని కోరుకుంటున్నామో కెమల్ పాషా టర్కీలో అదే చేశాడు. అతడు టర్కీదేశాన్ని ఇస్లాంకు, అంటే మతానికి అతీతంగా వుంచాడు. ఇస్లాం మతాన్ని మానవుని వ్యక్తిగతమైన (దైవ మానవ సంబంధంగా హృదయంలో మాత్రమే వుండాల్సినదానినిగా) దానిని చేశాడు. బహిరంగ జీవితానికి, ప్రభుత్వ భవనానికి, బజారుకీ దూరంగావుంచాడు. మసీదుగామార్చబడి, 450 సంవత్సరాలు మసీదుగా వాడబడిన సెంట్ సోఫియా అనే గొప్ప గ్రీసు చర్చిని చిత్రప్రదర్శనశాలగా మార్చాడు. టర్కీలో పాన్ ఇస్లామిక్ (పాన్ ఇస్లాం ఉద్యమం అంటే మహమ్మదీయ మతస్తులంతా ఒక వర్గంగా యేర్పడి ఆఫ్రికా ఖండంలోని ట్యునీసియా మొదలు ఆసియా ఖండములోని ఇండోనీషియావరకు అన్ని రాజ్యాలను ముస్లిం రాజ్యాలుగా చేసి ప్రపంచంలో మహమ్మదీయ మత మహారాజ్యం నిర్మించాలని కలలుగనే మత, రాజకీయ ఉద్యమం) ఫెజ్ టోపీని పెట్టుకోడాన్ని నిషేధించాడు.

ముస్లింలు మసీదుల్లో జరిపే మత ప్రార్థనలు టర్కీ దేశానికి చెందని అరబ్బీ భాషలోగాక టర్కీ భాషలోనే జరపాలని ప్రతి టర్కీ ముస్లింమీదా ఒత్తిడి తెచ్చాడు. ఇది సహజం. జాతీయం కూడా, టర్కీ స్త్రీలు ముసుగు వేసుకోవడాన్ని (పర్దా పద్ధతిని) రద్దు చేశాడు. ముస్లిం చట్టాలలో ఒక ముస్లిం నల్గురు స్త్రీలదాకా పెళ్ళాడవచ్చని వున్నా, దానిని మార్చి, ఒకే సమయంలో ఒక స్త్రీ కన్నా హెచ్చుమందిని వివాహమాడిన ఏ టర్కీ ముస్లిమైనాసరే కొరత వేయవలసిందిగా చట్టం తయారు చేశాడు.

'ఇస్లాం నాగరికత' అనుకునేదాన్ని తల్లక్రిందులు చేసిన ఇటువంటి తీవ్రమైన సంస్కరణలు ఎందుకు చేశాడు? అవన్నీ టర్కీకి క్షేమకరం అనీ, లాభకరం అనీ ఆయన గుర్తించాడు కనుకనే, టర్కీలో ముస్లిం లంతా 'ఇస్లాం నాగరికత' (మధ్యయుగపు అరబ్బీ నాగరికత) తో వున్నారా లేదా అనేది అంత ముఖ్యవిషయం కాదు. టర్కీలోని ముస్లింల దృష్టిలో **"టర్కీ దేశం ముందు, ఇస్లాం మతం తరువాత"** అనే భావన దీనివల్ల కల్గింది. విజ్ఞానంతో, బుద్ధితో సాంఘికంగా టర్కీ జాతియొక్క అభివృద్ధి ఆయనకు ముఖ్యంగాని ఇతరం కాదు. ఏ **మతమైనా వ్యక్తిగతమైందే. అంతకుమించి ప్రధానమైంది కాదు. అందువల్లనే ప్రతి మతం మాదిరిగానే యిస్లాం మతం కూడా తలవంచక తప్పలేదు.** ఎక్కడెక్కడైతే టర్కీ జాతీయ శ్రేయస్సుకు వ్యతిరేకంగా వుందో అక్కడక్కడల్లా 'ఇస్లాం సంస్కృతి, ఇస్లాం నాగరికత' అనబడే మధ్య యుగపు అరబ్బీ సంస్కృతి, నాగరికతలు తలవొగ్గక తప్పలేదు.

## పర్షియా ఉదాహరణ

రెజాషా పెహ్లావి నాయకత్వాన పునర్జన్మ పొందిన పర్షియా విషయం చూద్దాం. పర్షియా, భారతదేశానికి వలెనే, ముసల్మాను యుగానికి పూర్వం చాలా గొప్ప చరిత్ర కల్గిన దేశం. ముసల్మానులు పర్షియా ఆక్రమించాక పూర్వపు పర్షియా సంస్కృతి నామరూపాల్లేకుండా తుడిచివేయబడింది. ముస్లింలు హిందూ దేశానికి వచ్చిన తర్వాతకూడా, వారు రాకముందు నుంచీ వున్న హిందూ సంస్కృతి ఈనాటికీ హిందూ సంస్కృతిగా-భారతీయ సంస్కృతిగా నిలిచిపోయింది. పర్షియా దేశానికీ, మన దేశానికీ ఇంతే తేడా.

పర్షియాను ముస్లింలు ఆక్రమించాక అక్కడి జీవితంలో అరబ్బీ ప్రభావం ఆలోచనలు పూర్తిగా పాతుకుపోయాయి. (ముస్లింలు రాకముందు

అక్కడ జెండు అవస్థా గ్రంథం మత గ్రంథంగాగల పారశీలు వుండే వారు. దాదాపు అందరూ ముస్లింలుగా మార్చివేయబడ్డారు. పార్శీలుగా బ్రతకదలుచుకున్న కొద్దిమంది మన భారతదేశానికి పారిపోయివచ్చి, మన శరణు కోరి మన రక్షణ క్రింద యిక్కడ మన సంస్కృతిని, జాతీయతను గౌరవిస్తూ జీవిస్తున్నారు.) కాని ఈ ముస్లిం మతతత్వానికి విరుద్ధంగా కొత్త జాతీయ భావం తలెత్తింది. రెజాషా పెహ్లవి కాలంలో ఈ జాతీయత వెల్లువికి విజృంభించినా ఈ తలెత్తడం మెల్లమెల్లగా జరిగింది. పర్షియా ముస్లిం రాజ్యంగా, మారినప్పటినుండీ స్వతంత్ర జాతీయ భావాలు ఎలా తలెత్తాయో మనం చూడవచ్చు. గత శతాబ్దంలో పర్షియా "బేబిజం"లో వుంది. అంటే చంటిపిల్ల మనోస్థాయిలో వుంది. అయినప్పటికీ మనకు ఆశ్చర్యం కల్గించే నవీన మేధస్సును, తెలివితేటలను, సాంఘిక తత్వాన్ని ఈనాడు దానిలో చూస్తాం. ఈనాటి పర్షియన్ పద్యాలలో, సాహిత్యంలో ఇందుకు ఉదాహరణలు కొల్లలుగా కనిపిస్తాయి. ఆ భావాలకు తుది మెరుగులు దిద్దాడు రెజాషా పెహ్లవి. ఈ రెజాషా పెహ్లవి కావించిన సంస్కరణలు మన దేశంలోకూడా ప్రఖ్యాతి చెందాయి.

**రెజాషా పెహ్లవీ పర్షియా ముస్లింలలో మతతత్వాన్ని పోగొట్టి జాతీయత తేవడానికి ఏ సంస్కరణలు చేశాడు ?**

పర్దా పద్ధతిని తొలగించాడు. ముల్లాహాల్వీల వంటి యితరుల ప్రభావాన్ని నిరుత్సాహపరిచాడు. తూర్పులోగల ఒక ఆర్థిక వలస రాజ్యంగా పాశ్చాత్య రాజ్యాల దృష్టిలో ఉన్న పర్షియాను కొత్త రాజ్యంగా మార్చి దానికి అవసరమైన చట్టాలు చేసి అమలుజరిపాడు. ఈ చట్టాలలో తూర్పు రాజ్యాలలోని చట్టాల లక్షణాలువున్నా, అవి పర్షియను లక్షణాలనే ప్రధానంగా కల్గివున్నాయి. పాన్ ఇస్లాం పేరుతో అంతర్జాతీయంగా ముస్లిం

లంతా ఫెజ్‌టోపీ తప్పక ధరించడమనే దానిని మాన్పించాడు. దానికి బదులుగా పర్షియన్ పెహల్వీజానెట్ అనేదాన్ని చిహ్నంగా వాడాలన్నాడు. ముస్లిం కానప్పటికీ పర్షియాలో ముస్లింల రాకకు ముందున్న సేఫోర్సు, ఖోస్రసు, డరయసు రాజుల కాలం నాటి పర్షియా గత వైభవాన్ని చక్కటి పద్ధతిలో పర్షియను ముస్లింలు తమ జాతికి చెందిన గొప్పవిగా భావించేటట్లు చేశాడు. **ఇవి భారత ముస్లింలు అనుసరించతగ్గ అంశాలు. ఇది ప్రధానమైన జాతీయ కార్యక్రమం. సంస్కృతి దృష్ట్యా అత్యంత ప్రముఖమైనది** పర్షియా ముస్లింలవికాక, ముసల్మానులు రాకముందు పర్షియాలో గల జొరాష్ట్రియన్ రచనలు, మరుగుపడుతున్న సూసా, పెర్సెపాలిస్ వైభవాలను, ఇతర సాహిత్యాన్ని, పర్షియా కళను కూడా నేటి పర్షియన్ ముస్లింలు తనరీతిని ఆరాధించారు, ప్రేమించారు. ఇప్పటికీ వ్యక్తిగత జీవితంలో పర్షియాలో ఇస్లాం మతం సజీవంగానే వుంది. కాని జాతీయ జీవితంలో ఏ రంగంలోనైనాసరే దానికి ఎలాటి ప్రాముఖ్యతాలేదు. ఇరాన్ అనబడే పర్షియా దేశంలో అరబ్బీ అర్ధ చంద్రాకారపు చిహ్నానికి తావు లేదు. దాన్ని తీసేసి ముస్లింలు రాకముందు ఇరాన్ సంస్కృతికి చిహ్నంగా వున్న ఆర్యుల స్వస్తిక చిహ్నాన్ని నేటి ఇరాన్ లేదా పర్షియా ప్రజలు దాదాపు అందరూ ముస్లింలే అయినా అంగీకరించారు. పర్షియాలో వున్నది-ముస్లిం మతానికి వ్యతిరేకంగా అంతకు పూర్వమున్న జొరాష్ట్రియన్ మత సంబంధమనే మీమాంసకాదు. ముస్లిం మతం పేరుతో చలామణీ అవుతున్న అరబ్బీ సాంస్కృతిక వలస విధానంకు ప్రతిగా-వ్యతిరేకంగా ఇరానీ లేదా పర్షియన్ జాతీయత పైకి రావడమే.

"మనకు తెలియని" విషయాలను గూర్చి (అంటే మనిషికీ, దేవుడికీ మధ్యగల మతమనే పేరుతో వుండే సంబంధాలు) పోట్లాడుకోవద్దనీ, ఈ రగడకు శాశ్వతంగా స్వస్తి చెప్పమనీ భారత క్రైస్తవులను ముస్లింలను

హిందువులనబడే శైవ, వైష్ణవ, శాక్తేయ, బౌద్ధ, జైన, శిక్కు మొదలగు మతస్థులగువారినీ కోరుదాం. తరచు మతం అనే పిచ్చిలోనో, చాదస్తంలోనో పడి భారత దేశాన్ని మరచిపోవడం జరుగుతున్నది కనుక ఇలా అడగడం అవసరం. మీ కిష్టం వచ్చిన మతాన్ని (పూజా విధానాన్ని) నమ్మండి. ఏదీ నమ్మకపోయి నాస్తికులలాగున్నా యిబ్బంది లేదు. మతాన్ని గూర్చి ఎవరి అభిప్రాయం ఎలాంటిదైనాసరే, అందరికీ ఒకటిగానే వున్న, సమానంగా వున్న సాంఘిక, జాతీయ జీవనంతో దాన్ని ముడిపెట్టకండి. రాజకీయాల ప్రసక్తి వచ్చినప్పుడు అందరూ తమ కార్యకలాపాలను భారత దేశ శ్రేయస్సు అనే ఆధారం మీద నడపాలి. పురాతన వేదకాలం నుండీ ఇంకా అంతకుముందునుండీ కూడా అవిచ్ఛిన్నంగా వస్తున్న భారతీయ కళలు, సాహిత్యం, ఆశయ ఆదర్శాలు, భావాలు మొదలగువాటిని పరంపరానుగతంగా వస్తున్న జాతీయ సంపదగా, ఈ జాతి సొత్తుగా భావించి ప్రేమించాలి. వీటిని సాంస్కృతికంగా అంగీకరించాలి. ఏ మతస్తులైనా సవటర్కీ, పర్షియాలలో తురుష్కులు, ఇరానీలు భావిస్తున్నట్లుగా, బ్రిటిష్ వారు తమను బ్రిటిష్ వారుగా, జర్మన్లు తమను జర్మన్లుగా భావిస్తున్నట్లు హిందూదేశంలో తమను హిందువులుగానే అంటే భారతదేశంలో తమను భారతీయులుగానే భావించుకోవాలి.

## జపాన్ ఉదాహరణ

టర్కీ, పర్షియా దేశాలు ముస్లిం దేశాలు కనుక అవి మన దేశంలో ముస్లింలకు పాఠం నేర్పేవిగా వున్నాయి. మతం, రాజకీయాలు, సంస్కృతి- వీటి విషయంలో భరతీయుల భావాలు యెలా వుండాలో మనం జపాన్ నుంచీ నేర్చుకోవచ్చు. **నిజానికి మతం, సంస్కృతి, రాజకీయాల మధ్య గల** సంబంధాన్నిబట్టి యేదేశమైనా సాధించిన అభివృద్ధిని అంచనా వేయవచ్చు. ఆధునిక ప్రపంచ రాజ్యాలతో జపాన్ పోటీకి దిగేటట్లుగా చేసిన

'కమ్మోడోర్ పెర్రీ' కాలంకంటె ముందే జపాన్ తన ఆలోచనలలో, దృక్పథంలో నవీనతను, కొత్తదనాన్ని సాధించింది. ఈ విషయంలో యూరోపు దేశాలకన్నా ఒక అడుగు ముందుకు వేసింది. మతంపైగల నమ్మకాన్ని సంస్కృతీ, రాజకీయాలకు దూరంగా వుంచింది.

ప్రపంచంలో ఎక్కడైనా భారతీయులున్నారంటే విదేశీయులు వారు ఏ మతస్తులో వెంటనే చెప్పగలరు. వారిపేర్లు వినంగానే వారు ఏ మతస్తులో చెప్పవచ్చు. అంతేగాదు, తాము ఏ మతస్తులమో చెప్పడం ముఖ్యమైనట్లుగా మనవారే తమ మతాన్నికూడా చెబుతారు!

ఇతరదేశాల్లో జపాను వాళ్ళు వుంటే ఒక జపానువాడు ప్రక్కనున్న జపానువాని మతం ఏమిటో తెల్సుకోవాలని అనుకోడు. అసలు అతడు దానివిషయం పట్టించుకోడు ఒకవేళ నీవు అతని మతాన్ని గూర్చి అతనిని ప్రశ్నిస్తే ఆ ప్రశ్న హాస్యాస్పదంగా వుంటుందతనికి. అదొక పెద్ద భేదమా అని నవ్వుతాడు. వాళ్ళంతా జపానీయులా కారా? అతనికి కావల్సిందంతే.

జపాన్ చరిత్ర చూస్తే అక్కడ అనేక మతాలున్నాయి. ఇదివరకు అనేకమతాలు జీర్ణించుకోబడ్డాయి. (ఆ పాతకాలపు కనపడని అనేక మతాల దేవుళ్ళ విగ్రహాలు ఈ నాటికీ జపాన్‌లో వున్నాయి. వాటన్నింటినీ కలిపి షింటో దేవుళ్ళ విగ్రహాలంటారు.) అయితే ఆ దేశానికి ఒక సంస్కృతి, ఒక జీవితవిధానం వున్నాయి. వాళ్ళంతా ఒక జాతి. ఇక్కడ హిందువులు, ముస్లింలు, క్రైస్తవులు కూడా అలాగే వుండాలి. మనం వ్యక్తిగతంగా వుంచుకోవలసిన ప్రాథమిక విషయాలలో జపాన్‌వాళ్ళవలె మనం నడుచుకోకపోతే మనం ఒక జాతి కాలేము. మతాన్ని ఫక్తు వ్యక్తిగతమైనదిగానే వుంచాలి. ఎవరు అల్లాను ఆరాధిస్తున్నారు? ఎవరు కృష్ణుని లేదా క్రీస్తును ఆరాధిస్తున్నారు? ఎలా పూజిస్తున్నారు? అనేదాన్ని గూర్చి మనం పట్టించుకోకూడదు.

ఈ రోజులల్లో బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీలలో జపాన్‌లో మాదిరిగానే మతాన్ని వ్యక్తిగతంగా చూస్తున్నారు. కాని సంస్కృతి, రాజకీయాలు అలా కాదు. ప్రతి జపాన్ వ్యక్తి గృహజీవనంలో కూడా జాతీయ సాంస్కృతిక భావాలు, జాతీయ రాజకీయాలు ఎక్కువ ప్రముఖంగా వుంటాయి.

క్రీస్తును దేవుడని నమ్మినందుకు, దేశపురాజునే దైవంగా భావించనందుకు వేలాది మంది క్రైస్తవులను రోము (ఇటలీ) లో చంపారు. జాతీయ షింటోను (ఇది మతం కాదు. మన దేశంలో హిందూత్వం మాదిరిది) బౌద్ధ మతం అనుసరించే వారి ప్రక్కనే ఎంతో భక్తితో, ఈ నాటి జపాన్ దేశంలో గల క్రైస్తవులు కూడా గౌరవిస్తున్నారు. అన్ని ఉత్సవాల్లో పాల్గొంటున్నారు. జపాన్‌లో కొత్త ప్రభుత్వం యేర్పడినప్పుడు ఐస్‌లోవున్న సూర్యదేవుడి కుమారుని యొక్క పవిత్ర దేవాలయంలో మంత్రులందరూ వెళ్ళి ఆ దేవుని ఎదుట భక్తిశ్రద్ధలతో ఆయన పేరుమీద ప్రమాణాలు చేస్తారు. ఆ సందర్భంలో షింటో పద్ధతుల్లో ఒక తంతు జరపబడుతుంది. అలాగే ఒక దేశంమీద యుద్ధం ప్రకటించడం లేదా సంధి చేసుకోవడంవంటి ముఖ్యమైన నిర్ణయాలు జపాన్ ప్రభుత్వం తీసుకునేముందు ఒక తంతు జరుగుతుంది. ఆ దేశపు జాతీయ దైవాలను (షింటో దేవుళ్ళను) ప్రతినిధులందరూ చక్కని సలహాలివ్వమని నిష్ఠతో, భక్తితో ప్రార్థిస్తారు. ఈ సమయాలలో ఏ జపాన్‌దేశపు వ్యక్తికూడా 'నేను షింటోమతం వాడిని కాదు కనుక అక్కడకు రాను అనిగాని, నేను ముస్లింను కనుక లేదా క్రైస్తవుడిని కనుక ఆ విగ్రహారాధనచేయను అని; విగ్రహారాధనను నీచంగా చూడడం కాని చేయడు. పైగా శ్రద్ధతో, భక్తితో ఆ ఉత్సవాలలో పాల్గొంటాడు.

అలాగే షింటోను అనుసరించేవారికీ, (ఇది మతం కాదు. శైవ, వైష్ణవ, శాక్తేయ, బౌద్ధ, శిక్కు, జైన, కాపాలిక, వైదిక మతాలన్నింటినీ కల్గియున్న మన హిందూత్వం వంటిది) బౌద్ధమతం అనుసరిస్తున్న వారికీ మధ్య సాంఘిక విభేదం లేదు. ఎన్నడూ వుండదు కూడా. నూటికి నూరు పాళ్ళ బౌద్ధ కుటుంబాలలోకూడా షింటో ఆచారప్రకారమే పెళ్ళిళ్ళప్పుడు, పిల్లలు పుట్టినప్పుడు, కర్మకాండ జరుపుతారు. ఒక షక్తు షింటో బాలిక బౌద్ధ కుటుంబంలో వ్యక్తినిగాని, క్రైస్తవునిగాని పెళ్ళిచేసుకుంటే జపాన్‌లో తప్పుకాని, అవమానంకాని కాదు. దీనివల్ల ఏ సమస్యా రావడం అనేది జరగదు. బౌద్ధం ఒక తత్త్వం; క్రైస్తవం ఒక మతం; షింటో ఇంచు మించు జపాను సంస్కృతికి మారుపేరు. ఒక బాలిక క్రైస్తవమతం పుచ్చుకుంటే అదంత ప్రధానం కాదు కనుక ఆమెకే వదిలివేయబడుతుంది. ఆమె ఏ మతాన్నవలంబించినా ఆమె సాంఘిక జీవితంలో, ఆచార వ్యవహారాల్లో ఎలాంటి మార్పులూ రావు. ఆమెలో కూడా ఎలాంటి మార్పు వుండదు. ఆమె పిల్లలకు లాటిన్, హీబ్రూ, అమెరికన్ పేర్లుగాక (అంటే జాన్, హెన్రీ, పాల్, పీటర్‌వంటి క్రైస్తవమతాన్ని తెలిపే పేర్లు) జపాను పేర్లనే పెడతారు. **ఇలా చేయాలని ప్రభుత్వ శాసనం కనుక ఇలాగే జరిగితీరుతుంది** బడుల్లో పిల్లలకు వాళ్ళ తల్లిదండ్రుల మతం క్రైస్తవ మతమైనా, బౌద్ధమతమైనా, ఇస్లాం మతమైనా-ఏ మతమైనాసరే "కోజికీ" చెబుతారు. "కోజికీ" అంటే జపాను వీరులు ఇతిహాస దేవతలు మొదలగువారి జీవితాలకు చెందిన పుస్తకాలు. ఇవి మన హిందూ పురాణాల వంటివి. తమ తల్లిదండ్రులకు బైబిల్‌నందు లేదా ఖురానునందు లేదా బౌద్ధ పుస్తకాలమీద నమ్మకం వుంది కనుక, వాళ్ళమతం వేరు కనుక ఈ "కొజికీ" పుస్తకాలన్నీ "ఉట్టి చెత్త" అనీ, 'పుక్కిటి పురాణం' అనీ చెప్పగల దమ్ములు ఎవరికీ వుండవు. ఆ ప్రాచీన జాతీయ గ్రంథాలయెడ భక్తి శ్రద్ధలు కలిగివుండాలనీ, అవి జాతీయమైనవి గనుక వాటిని మిక్కిలి

పవిత్రమైనవిగా భావించాలనీ జపాను సమాజంలో అందరూ, ముఖ్యంగా ప్రతి తల్లీ తండ్రీ తమ పిల్లలకు బోధిస్తారు. ఒక జపాన్‌దేశీయుడు తనకు నచ్చిన ఏ వేదాంత విషయాన్నిగాని, మతాన్నిగాని, తత్త్వాన్నిగాని యిష్టం వచ్చినట్లుగా కల్గివుండవచ్చు. అయితే అతని రాజకీయదృష్టి జాతీయంగా వుంటుంది. అంటే రాజకీయాలన్నీ ఆ దేశపు రాజుయొక్క ఘనత కోసం, రాజ్యం యొక్క వైభవం కోసమే అనే భావనతోనే జరుగుతాయి. పరంపరానుగతంగా వస్తున్న ఒకే ఒక సంస్కృతి అతనిది. అది షింటో సంస్కృతి. ఈ షింటో సంస్కృతికి లోగడ భారతీయ తత్త్వం (బౌద్ధం రూపంలో) రూపురేఖలు దిద్దింది. పాశ్చాత్య తత్త్వం ఇటీవల ఈ షింటో సంస్కృతికి సర్వతో ముఖాభివృద్ధికి కావాల్సిన వన్నెలు దిద్దింది. కాని జపాన్ తన ప్రాథమిక మూలసూత్రాలపట్ల మాత్రం అచంచలమైన విశ్వాసం వుంచుకుంటున్నది.

ఈ రకంగా టర్కీ, పర్షియా, జపాను దేశాల్లో గల జాతీయ దృక్పథాన్నిగూర్చి తెల్సుకున్నాం. ఇక ఆ దేశాలలో గల జాతీయ దృక్పథంతో మన దేశంలో పరిస్థితిని పోల్చుకుని చూద్దాం.

## నేటి మన పరిస్థితి

హిందువుల పురాణ, ఇతిహాస కథలను హేళనచేసే భారత క్రైస్తవుని కానీ భారత ముస్లింని కాని (ఇలాంటివారు క్రైస్తవుల్లో, ముస్లింలలో చాలామంది వున్నారు.) నీవు విమర్శిస్తావనుకో. హిందువులు కాని వారంతా నీ విమర్శ తప్పంటారు. ఎక్కువమంది హిందువులు నిన్ను సమర్థిస్తారు (చాలామంది హిందువులు ఉదాసీనంగా వుంటారు!) నిన్ను సమర్థించే హిందువులుకూడా తమ జాతీయ అభిమానంపై దెబ్బ తీయబడిందనే ఉద్దే

శ్యంతోగాక ఏదో మతాభిమానంతో (మత విషయిక కారణాలతో) నిన్ను సమర్థిస్తారు. (ఈ జాతి గాథలను అవమానించిన వ్యక్తి భారత క్రైస్తవుడైనా భారత ముస్లింలుకూడా కేవలం హిందువులమీద ద్వేషంతో ఆ క్రైస్తవునే సమర్థిస్తారు కాని నిన్ను సమర్థించరు!) ఇదీ నేటి స్థితి. ఎవరో ఊరూ పేరూలేని ఒక పత్రికా రచయిత ఒక చౌకబారు "ముస్లిం" పత్రికలో శ్రీకృష్ణుడు "బృందావనంలో సంచరించిన జారుడు" అని వ్రాసి ఈ దేశపు ఇతిహాస గ్రంథాలను యెంతో అగౌరవిస్తే దానికి ప్రతిగా ఒక బహిరంగ సభ యేర్పాటు చేస్తారు. శ్రీకృష్ణుని అవమానించిన ఆ సిగ్గుమాలిన పత్రికనూ, ఆ సంపాదకునీ ఘాటుగా విమర్శిస్తారు- ఉపన్యాసాలలో. వాళ్ళను శిక్షించకుండావున్న చవట ప్రభుత్వాన్ని దుయ్యబడతారు. (ఈ ఉపన్యాసాలలో తమ మతం ఏదో అవమానించబడినట్టుగానే యెక్కువగా అభిప్రాయాలు వెల్లడిస్తారు) అంతేగాని, సోదర భారతీయులు, మహమ్మదీయులు క్రైస్తవులు ఇత్యాది) తమ ప్రఖ్యాత జాతీయ వీరుని అవమానపరచినందుకు ఇతర భారతీయులు చూపే విచారం కాదది. శ్రీ కృష్ణుని హిందూ దేవుడుగా కాక, మన గత చరిత్రలో గొప్ప పాత్ర వహించిన మహాపురుషుడిగా, జాతీయ వీరుడిగా భావించి; ఆయనకు "ఒక" స్థానిక పత్రిక చేసిన అపచారంగా మేము ప్రతిఘటిస్తున్నామని ఏ మతస్తులైనా సరే భారతీయులంతా కలసి జరిపే వ్యతిరేక ఉద్యమం కాదది. హిందువుల పూర్వీకులే ఈనాటి భారత క్రైస్తవులకు, భారత ముస్లింలకు పూర్వీకులు అనే నగ్న సత్యం గుర్తించి తమ గత చరిత్రలోని తమ పూర్వీకులలో ఒక మహనీయుని అవమానించడంద్వారా తమ పురాతన వైభవం దెబ్బ తిన్నదన్న భావంతో ఈనాటి ముస్లింలు, క్రైస్తవులు, హిందువులు అందరూ ఏ భేదం లేకుండా కలిసి చేసే ప్రతిఘటన కాదది.

విదేశాల్లో మాదిరిగానే.... జపాన్‌లో "షింటో" పురాణ గాథలపట్ల, ఆచార వ్యవహారాలపట్ల జపాని ముస్లిం, జపాని క్రైస్తవుడు, జపాని

బౌద్ధుడు ఎలా ఆత్మీయభావం చూపుతున్నారో అలాగే హిందూ పురాణాల పట్ల, హిందూ ఇతిహాసాలపట్లా, హిందూ ఆచార వ్యవహారాలపట్ల హైందవేతరులంతా (ముస్లింలైనాసరే, క్రైస్తవులైనా సరే, పార్శీలైనా సరే, ఎవరైనా సరే అందరూ) ఆత్మీయభావాన్ని ప్రకటించాలి. **మనమంతా ఒకే జాతి కావడానికి ఇది ఒకటే మార్గం.**

## జాతీయ సాహిత్యం

హిందూ, ముస్లిం, సిక్కు, క్రైస్తవ ఇత్యాది భేదాలు లేకుండా అందరూ సమంగా హిందూ పురాణాల మూలతత్త్వాన్ని, వాని అర్థాన్ని తెల్సుకోవాలి. మన పాఠశాలలన్నింటిలోనూ మన జాతీయ గ్రంథాలు-రామాయణం, మహాభారతం, భాగవతం మొదలైనవి ఏ మతస్థులైనాసరే-అందరిచే తప్పక చదవబడాలి. ప్రస్తుత గ్రీకు బాలురు (క్రైస్తవులు) ఎకిలీస్ కథను (క్రీస్తు మతం రాకముందు గల గ్రీకు గ్రంథాల్లోని జాతీయ వీరుని కథ), జర్మన్ పిల్లలు (ఇప్పటి క్రైస్తవులు) సీగ్‌ఫ్రీడ్ చరిత్రను (క్రీస్తుమతం రాకముందుగల జర్మనువీరుని కథ), జపాన్ బిడ్డలు యమాతోడెక్ గాథను (షింటోవీరుని కథ) ఎలా గౌరవిస్తూ చదువుతారో అలాగే మనదేశంలోకూడా ఏ మతస్థులైనాసరే శ్రీరాముని, అర్జునుని, పాండవులయొక్క, శ్రీకృష్ణునియొక్క (అలాగే శిబి, హరిశ్చంద్రుడు, అంబరీషుడు మొదలగువారియొక్క) గాథలు తప్పక తెల్సుకోతగినవిగా భావించి మన పిల్లలకు నేర్పబడాలి. ఈ వీరుల జీవితాలు నిజం కావచ్చు, కల్పన కావచ్చు. కాని ప్రఖ్యాతి చెందిన మన పురాతన జీవితానికి చెందినవి. మన పూర్వులవి. వీరినిగూర్చి వ్రాయబడ్డ గ్రంథాలు ప్రాచీన భారత సారస్వతానికి మకుటాయమానాలు. మన గొప్ప సాహిత్య సంపద యిది. ఏ వ్యక్తియొక్క వ్యక్తిగతమైన మతం, భావాలు మొదలయినవి యేలాటివైనా కావచ్చు. కాని, వీరిని గూర్చి తెల్సుకుని వుండకపోవడం భారతీయునకు సిగ్గుచేటు.

జాతీయ పురాణ గ్రంథాలేగాక సంస్కృత సాహిత్యంలోని గొప్ప పుస్తకాలనన్నింటిని గురించి భారతీయులందరూ తెల్సుకోవాలి. అంతేగాక, ప్రజలందరిచే ఆరాధించబడే హిందూదేవతలను, వీరులను గూర్చి (షింటో దేవతలను గూర్చి జపాను బౌద్ధులు, క్రైస్తవులు వగైరా జపాను వాళ్ళంతా తెల్సుకున్నట్లు) హిందువులేకాదు, హిందువేతరులందరూ తెల్సుకోవాలి. మన భారతదేశపు గడ్డమీద దైవత్వం నెలకొల్పిన వీరులుగా, మనకు అందరాని సత్యాలకు చిహ్నాలుగా, భారతజాతి ప్రత్యేకతను, ఏకతను గుర్తించడానికి గాను మన జాతీయ గ్రంథాలయొక్క సృష్టిగా వీరు గుర్తించబడాలి. అంతేగాని, ఏ ఒక తెగకు చెందిన దేవతలుగానోకాదు. అలా వారిని దేవతలుగా భావించే తెగను వారిని పూజించుకోనివ్వండి. ఇతర భారతీయులంతా మతంతో నిమిత్తంలేకుండా, వారియెడ గౌరవభావంతో ప్రవర్తించాలి. జపానీ దేశీయులు షింటో దేవతలయెడల ఎలా ప్రవర్తిస్తారో అలాగే యిక్కడా హిందూదేవతల యెడల అందరూ నడచుకోవాలి.

జపాను క్రైస్తవుడు తన కొడుకు బళ్ళో 'కోజికి' చదవడానికి ఎలాంటి అభ్యంతరం పెట్టనప్పుడు, భారత ముస్లింకాని, క్రైస్తవుడు కాని తన కొడుకు బళ్ళో పురాణాల్లోని కొన్నికథలు లేదా శ్రీరాముని, శ్రీకృష్ణుని గూర్చి చదువుకుంటుంటే ఎందుకు అభ్యంతర పెట్టాలి? అలా చదువుకోవడంవల్ల వచ్చిన నష్టమేమిటి?

ప్రస్తుత పరిస్థితులలో వారు తప్పక అభ్యంతరపెడతారని మనకు తెల్సు. అయితే భారతదేశం ఐరోపాలోని క్రైస్తవదేశాలవలె, టర్కీ, పర్షియాల వలె లేదా జపాన్‌వలె ఆధునిక దేశంగా కావాలనుకుంటే-భారతీయులు ఒకే జాతిగా రూపొందాలనుకుంటే-వీరు దీనికి ఏ సంకోచాన్నీ ప్రకటించకూడదు. జూపిటర్, కెపిటోలినస్‌లనుగూర్చి (ఇటలీలోని క్రైస్తవేతర రోమ్ దేవతలు) తన కొడుకు చదవడం; లాటిన్ సంస్కృతి

సృష్టించిన పురాతన దేవతలను, వీరి శిథిలాలయాలతో తమ దేశంనిండా గల పుణ్య స్థలాలను గౌరవంగా, పూజ్యభావంతో చూడడానికి ఏ ఆధునిక రోమన్ పౌరుడూ అభ్యంతర పెట్టనట్లే; తన కొడుకు అవెస్తాను చదవడానికి లేదా ముస్లిం మతానికి చెందని జొరాష్ట్రియన్ ఆరాధనలతో సంబంధం కల్గివుండడానికి నేటి ఇరానీ (పర్షియా దేశస్థుడు) ముస్లిం ఎంతమాత్రం అడ్డుపెట్టనట్లే, ఇచ్చటి మహమ్మదీయులు, క్రైస్తవులు మొదలగువారు కూడా ఎలాంటి అడ్డూ పెట్టగూడదు.

## ప్రత్యేక చిహ్నాలు పోవాలి

ముస్లింలను ముస్లిమేతరులను వేరుగా చూపే టోపీలు; హిందువులు, హైందవేతరులు వేరుగా చూపే గుర్తులు, చిహ్నాలు భారతదేశంనుండి అంతరించాలి. హిందువులైనాసరే కాకున్నాసరే భారతీయులందరూ ఆనందంగా జాతీయ దేవతల పేర్లతోసహా భారతదేశపు పేర్లనే పెట్టుకోవాలి. ఇందులో విగ్రహారాధన ప్రసక్తి లేనేలేదు. ఆధునిక గ్రీకులు హెర్క్యులిస్, అర్టెమిస్, ఏనా అనేటటువంటి క్రైస్తవీయము కాని ప్రాచీన గ్రీకు పురాణ పురుషుల పేర్లు పెట్టుకుంటారు. అయినా వారంతా క్రైస్తవులే! అలాగే క్రైస్తవము కాని బాల్డుర్, సిగ్‌ఫ్రీడ్ అనే పేరు నేటి జర్మనులు పెట్టుకుంటూ వుంటారు. కాని వారంతా క్రైస్తవులే.

'భగవంతుడు ఒక్కడే మహ్మద్ ప్రవక్త' అని నమ్ముతూ కూడా భారతీయ ముస్లిం శ్యామసుందర్ అని గాని, రామచంద్రరావు అని గాని ఎందుకు పెట్టుకోడు? (క్రైస్తవులలో రోమను కథలిక్కులు కాని ప్రొటెస్టంటు వగైరాలలో కొంచెం ఎక్కువగా పారిజాతం, నవనీతం యిలాంటి భారతీయత స్ఫురింపచేసే పేర్లు పెట్టుకునేదాకా జాతీయత ప్రభావం

యిప్పుడిప్పుడే మసక మసకగా కనపడుతున్నది.) భారత క్రైస్తవులు అంతా తమను భారతనామాలతో ఎందుకు పిలుపించుకోగూడదు? మతాన్ని రాజకీయాలనుండి, జాతీయతనుండి తొలగించి వ్యక్తిగతమైనదిగానే వుంచితే సహజంగా కలిగే ఫలితం మహమ్మదీయులు భారతదేశ చరిత్రను చూసే పద్ధతిలోనే మార్పు రావడం.

## చరిత్రచూసే దృష్టి మారాలి

ఇంతవరకు భారతదేశ చరిత్రను గూర్చి భారత ముసల్మానుల దృక్పథం "ముస్లిం"గానే వుందిగాని భారతీయమైందిగా లేదు. ఇతర దేశాలనుంచి మన దేశంపై దండెత్తి మన దేశాన్ని జయించి మన దేశాన్ని పరదేశ ముస్లిం శక్తులు పరిపాలించిన సమయాలు భారత ముస్లింకు ప్రత్యేక శ్రద్ధను, గర్వాన్ని కలిగిస్తాయి. అవి పూర్తిగా గాకపోయినా కొద్దిగానైనా మహమ్మదీయ 'మతం' అనుసరించేవారి పరిపాలన కనుకనే అతనికి ఆ ఆసక్తి కల్గుతుంది. అంతేకాని, భారతదేశ చరిత్రలో కల్గిన మార్పుల సందర్భంలో వాటికి గల ప్రాముఖ్యతవల్ల కాదు. భారతదేశం యే విదేశీ రాజ్యంయొక్క ఆక్రమణక్రిందా లేకుండా వున్న మన చరిత్రలోని మహోజ్జ్వల యుగాలనాటి సంఘటనలు, వైభవం అతనిలో యెలాంటి కదలికనూ, అభిమానాన్నీ, గర్వాన్నీ, శ్రద్ధనూ, ఆసక్తినీ కలిగించవు. అవి రోమను చరిత్ర, చైనా చరిత్రల మాదిరిగానే వుంటాయికాని అంతకంటె యెక్కువగా కనిపించవు.

భారత ముస్లింల ఈ మనస్తత్వం మారనంతవరకు వారు భారతీయులు కాజాలరు. భారత దేశంలో 'మతం' అన్నదాన్ని దానిఅసలైన స్థానానికి (అంటే వ్యక్తిగతమైనదిగా) తెస్తేనే ఆ మనస్తత్వము మారుతుంది. మతం పేరుతో మూఢంగా వుండడం, సంఘంలోని దురా

చారాలు పోయి హిందూదేశంలో మన జాతీయత, మన సంస్కృతి సగర్వంగా తలెత్తాలని మన కోరిక. భిన్న మతాలకు సంబంధించిన రాజకీయాలుండరాదనీ, విభేదాలు అంతరించాలనీ కోరుతున్నాం. ఇది సాధించబడాలంటే మనందరికీ గౌరవనీయమైనదీ, **మతం కన్నా ప్రియమైనదీ యేదో ఒకటి వుండాలి.** తనయొక్క సర్వ సౌందర్యాలతో, సాధనాలతో, మహత్తులతో, సాధనాలతో విలసిల్లే **భారతదేశమే అది.** అలాగే మనందరమూ ఒకే మాదిరిగా అసహ్యించుకునేదీ ఒకటి వుండాలి. అది భారతదేశ ప్రశస్తిని వ్యతిరేకించేదంతా మనం అసహ్యించుకునేది.

## ఆధునిక యుగపు పాఠాలు

నవీన ప్రపంచ పరిస్థితులకు తగినట్లుగా సరిదిద్దుకొనడమనే తత్త్వం లేకపోవడం మన దురదృష్టం. **ఇదే మన సమస్యలన్నింటికీ** మూలకారణం అని బాగా ఆలోచిస్తే మనకు స్పష్టమవుతుంది. ప్రతి యుగము నేర్పే పాఠాలను వెంట వెంటనే నేర్చుకోలేకపోవడంలోనే మన లోపం వుంది. బానిసలుగావున్నా, లేకున్నా, పరాయి పాలనలోవున్నా, స్వాతంత్ర్యం వచ్చినా, ముందంజ లేకుండావున్నా, పురోగమిస్తున్నా, ప్రపంచ జాతులతోడి సంబంధ బాంధవ్యాలు కల్గివున్నా వాటినుండి భారతదేశం యేమీ నేర్చుకోనట్లే కనిపిస్తుంది. కనీసంగా నేర్చుకోవాల్సిన ముఖ్య విషయాలనుకూడా వారినుండి మనం తీసుకోలేదు. **కొందరు ఈ తీసుకోలేకపోవడాన్నికూడా అర్థంలేని దురభిమానంతో ప్రశంసిస్తున్నారు.** మనం మాత్రం అలా ప్రశంసించలేం. ఇస్లాంతో మొదటిసారి ఢీకొన్నప్పుడే **వారిలోని సోదర భావాన్ని నేర్చుకుని** దానిని పెంచుకుని వుంటే మహమ్మదీయ దురాక్రమణ నుండి భారతదేశం తప్పించుకుని వుండేది. కనీసం తొందరలోనే ముస్లిం దురాక్రమణ నుండి స్వతంత్రులమై వియ్యేళ్ళ క్రితమే చక్కని పరిపుష్టమైన, బలమైన జాతిగా రూపొందివుండే

వాళ్ళం. ఐరోపా దేశీయులను మొదటిసారి ఎదుర్కొన్నప్పుడే వారినుండి **సమష్టి జాతీయ జీవితాన్ని**, అందరికీ ఒకటిగానేవున్న, సమానంగానే వున్న రాజకీయ, ఆర్థిక ఆశయాల సాధనకోసం కలిసి పనిచేయడాన్ని నేర్చుకుని వున్నట్లయితే ఐరోపియన్లకు - ఇంగ్లీషు వారికి పాదాక్రాంతుల మయ్యేవాళ్ళం కాదు - లొంగిపోయేవాళ్ళం కాదు. ప్రపంచపు చూపు పశ్చిమ దేశాలమీదనుండి తూర్పు ఖండంవైపు మళ్లుతున్న ఈ సమయంలో ఈనాడు భారతదేశం కులం పేరుతో, వర్గం పేరుతో, భాష పేరుతో, మతం పేరుతో కీచులాడుకుంటూ అశాంతితో నిండివుంది. భారతదేశం క్రమశిక్షణ, జాతీయతల విషయంలో ఇతర దేశాలనుండి ముఖ్యంగా జపానునుండి పాఠాలను నేర్చుకుంటే ఒక సర్వ స్వతంత్ర బలవత్తర జాతిగా రూపొందడమేగాక ప్రపంచములోని అగ్రరాజ్యాలలో ఒకటికూడా కాగలదు. అయితే ప్రపంచంలో ఈ మహత్తరమైన అగ్రరాజ్యం కావాలనే కోరిక - ఆకాంక్ష కోసం హిందువులమైన మనం - అంటే భారతీయులమైన మనం-అంటే శైవ, సిక్కు, ముస్లిం, పార్శీ, క్రైస్తవ మొదలగు మతాలు వ్యక్తిగతంగా అనుసరిస్తున్నా ఒకే సంస్కృతీ, ఒకే జాతీయత, ఒకే సాంప్రదాయాలు, ఒకే ఆచార వ్యవహారాలు, ఒకే ఆశా ఆకాంక్షలు, ఒకే ఆదర్శం, గమ్యాలు, ఒకే చరిత్ర, నాగరికతలు గల మనం - దేవుడిని గురించి మనకు వ్యక్తిగతంగావున్న అభిప్రాయాల ఆధారంగా వచ్చే భేదాలను, దక్షిణాదిన ప్రబలంగా కనిపించే కట్టు, బొట్టు, జుట్టులలో కనపడే భేదాలను ప్రాంతీయతను వదలిపెట్టడానికి సిద్ధంగా వున్నామా?

## హిందువులకు సలహా

మనందరకూ సర్వసామాన్యమగు భారతీయ సంస్కృతి వుంది. హిందూత్వమునుండి విడతీయరానంతగా దీనిలో కల్సిపోయిన ద్రావిడము, గౌడము, ఇస్లాము, పాశ్చాత్య భావాలూ కొన్ని ఈ సంస్కృతికి వన్నె

తెచ్చాయి. ముసల్మానులు, క్రైస్తవులు, పార్శీలు (జొరాష్ట్రియన్లు) భారత జాతీయులుగా వున్నవారంతా ఇచ్చటి 'మత' పద్ధతులు అవలంబించ కుండానే భారతీయ సంస్కృతి యందు హిందువులతో సమానంగా భాగం పంచుకోవాలి. భారతదేశం హిందువుల దెలాగో అలాగే మాదికూడా అని హిందువులతో భాగస్వాములుగా గర్వపడేటంతంగా వారు ఈ దేశాన్ని ప్రేమించాలి. ఆరాధించాలి. యుగ యుగాలుగా ప్రజా జీవితంలో పండుగలై, ప్రజలకు పరమానందదాయకాలైన హిందూ పురాణాలకు చెందిన దీపావళి. విజయదశమి, సంవత్సరాది, సంక్రాంతి, హోలీ వంటి పర్వదినాల ఉత్సవాలలో, వేడుకలలో వారంతటూ యధేచ్ఛగా పాల్గొనాలి, బ్రిటిష్ నాస్తికుడు కూడా క్రిష్టమస్ రాగానే తన పిల్లలకు ఆటబొమ్మలు కొంటున్నాడే? జపాను దేశపు వీరోత్సవాలలో ఆ మతానికి చెందనివారైన క్రైస్తవులు ఇత్యాదులు ఉత్సాహంతో పాల్గొనడం లేదా?

ప్రస్తుత పరిస్థితులలో చాలామంది హిందువులకు ఈ ఉద్దేశం బాధా కరమే అనిపించినాసరే-మన దేవాలయ ప్రవేశానికి హైందవేతర సోదరులను ఆహ్వానించాలి. దివ్యత్వంగల భారత వీరులను మన చరిత్రలోని పూర్వు లుగా జాతీయ వీరులుగా యెలా మనం అనుకుంటామో అలాగే వారినీ అనుకోమని అడగాలి. నింతగా కనిపించే విగ్రహాలను విధ్వంసం చేయ డానికిగాని, వాటిని అవమానపరచడానికి కాని కాకుండా తమ పూర్వులకు చెందిన-అంటే తమవైన పౌరాణిక పురుషుల జ్ఞాపక చిహ్నాలుగా ఆ విగ్ర హాలను భావించి గౌరవించడానికి దేవాలయాల్లోకి రమ్మని మనం వారిని ఒత్తిడిచేయాలి. "అస్పృశ్యులకు, క్రైస్తవులకు, ముస్లింలకు ప్రవేశంలేదు" అనేటటువంటి ప్రకటనలు, నిబంధనలు మన దేవాలయ ద్వారాలవద్ద వుండ రాదు. మనం మహోన్నంచితే "భారతీయులు (భారత దేశంలోని జాతీయు లైన హిందువులు, ముస్లింలు, క్రైస్తవులు, పార్శీలు ఇత్యాదులుగాక యితర

జాతీయులు) తప్ప యితరులు ప్రత్యేక అనుమతిలేనిదే లోనికి రాకూడదు"
అనేదిమాత్రమే వుంచాలి.

## ముస్లింలకు సలహా

హిందువుల దోషాలనుగూర్చి ఆలోచించినట్లే ముస్లింల దోషాలను గూర్చి ఆలోచిద్దాం. హిందువులలాగే ముస్లింలుకూడా తాము ఆలోచించే పద్ధతిని, అలవాట్లను వదలిపెడితేతప్ప ఒక జాతిగా రూపొందలేం. హిందువులు మారాలి. అలాగే ముస్లింలు, క్రైస్తవులు, పార్శీలు వగైరాకూడా యెంతో మారాలి.

మనం చూసే పద్ధతినిబట్టి ఒకే చరిత్ర రెండు విధాలుగా కనపడుతుంది. యూరోపులో జరిగిన 100 సంవత్సరాల యుద్ధం ఫలితాలు ఒకే రకమైనది. అయితే "ఆగిన్ కోర్టు" యుద్ధాన్ని ఒక ఆంగ్లేయుడు ఘనవిజయంగా భావిస్తే ఒక ఫ్రెంచి దేశీయుడు ఘోరని ఓటమిగా భావిస్తాడు. చరిత్రలోని సంఘటన ఒకటేకాని చరిత్రలు రెండు. దాన్ని చూసే ఫ్రెంచివాళ్ళ, ఆంగ్లేయుల దృష్టినిబట్టి ఈ రెండు చరిత్రలు యేర్పడ్డాయి.

అలాగే భారతదేశ చరిత్ర ఒకటే. దానిని మనం రెండు చరిత్రలుగా తయారుచేశాం! గజ్నీ, మహమ్మదు ఘోరీ, అల్లాఉద్దీన్ ఖిల్జీ, ఔరంగజేబు తదితరులు భారతదేశంపై దండెత్తి, దురాక్రమణ కావించి మనను బానిసలుగా చేసి పాలించిన విదేశీయులు. హిందువులకు అగర్భశత్రువులు వీరే. మహమ్మదీయుల కంటికి తాము నిరసించే విగ్రహాలను నాశనం చేసినవారు, తమ మతమైన ముస్లిం మతప్రబోధకులు, దానిని రక్షించేవారు ముస్లింలకు జాతీయ నాయకులుగా కనిపిస్తారు. జయపాల్, పృధ్వీరాజు, భీంసింగ్, గురుగోవింద్‌సింగ్, శివాజీ, రాణాప్రతాప్, వీళ్ళంతా

మన చరిత్రలో ముస్లింల నెదిర్చి పోరాడిన వీరులు. హిందువులు వీరిని జాతీయ నాయకులుగ, సమ్రాట్టులుగ, వీరాధివీరులుగా చూస్తారు. వీరినే భారత ముసల్మానులు తమ శత్రువులుగ, తిరుగుబాటుదారులుగ, దేశ ద్రోహులుగాకూడా అనుకుంటూ వుంటారు.

**అయితే ఒకే జాతికి పరస్పర విరుద్ధాలైన రెండు చరిత్ర లుంటవు** చరిత్రలో జరిగిన సంఘటనలను, వ్యక్తులనుగూర్చి ఒక కొలత బద్ధ వుంది. ఫ్రెంచివాళ్ళంతా ఫ్రెంచి విప్లవాన్ని గూర్చిగాని, నెపోలియన్‌ను గూర్చి కాని ఒకే అభిప్రాయంతో వుండనక్కరలేదు. అలాగే యింగ్లీషు వాళ్ళంతా క్రాంవెల్‌సుగూర్చి ఒకే అభిప్రాయంతో వుండాలనీ లేదు. అయితే....

## ఏది గీటురాయి ?

"**ఫ్రాన్సుయొక్క నిజమైన శ్రేయస్సుకోసం, మంచికోసం నెపోలియన్ కృషి చేశాడా, లేదా ?**" ఇదే కొలతబద్ధ నెపోలియన్‌ను గూర్చి ఫ్రెంచి దేశభక్తుడు నిర్ణయిస్తాడు. నెపోలియన్ "ట్రినిటి" (క్రైస్తవ దేవుళ్ళ) ని గూర్చి లేదా ముక్తిని గూర్చి ఏ అభిప్రాయాలతో వున్నాడనే ప్రశ్న లేనేలేదు. అలాగే ఇంగ్లీషు, జర్మను లేదా ఫ్రెంచి దేశభక్తుల విషయంలో కూడా.

తమ దేశ శ్రేయస్సు దృష్ట్యా, తమ సౌభాగ్యం దృష్ట్యా, తమ దేశపు గొప్పతనాన్ని గూర్చి వారు హృదయపూర్వకంగా దేనిని భావిస్తున్నారో దానిపైనే వారి ఆలోచనలు, నిర్ణయాలు లేదా యితర విషయాలు, చరిత్రలోని వ్యక్తుల ప్రాముఖ్యత ఆధారపడి వుంటాయి,

ఒకప్పుడు యూరోపులో పశ్చిమ ఆసియాలో గతాన్ని గూర్చి, చరిత్రను గూర్చి అటో యిటో తేల్చడమనేది **మతం మీద** ఆధారపడి వుండేది. ఆయా దేశస్థులు ఒక చరిత్రలోని గొప్ప వ్యక్తిని గూర్చి తర్కించుకునేటప్పుడు అతను ప్రొటెస్టెంటా. కాథలిక్కా అని ఆలోచించేవారు. క్రైస్తవులుకాని వాళ్ళ గొప్పదనాన్ని శంకించి అసహ్యించుకునే రోజులవి. కాని, ఆ రోజులు పోయి చాలా కాలమయింది. ఈనాడు ప్రపంచంలో-జాతీయభావ ప్రధానమైన దేశాలన్నింటిలోనూ గత చరిత్ర నిర్మించి గతించిపోయిన వాళ్ళను మెచ్చుకునే పద్ధతి ఒకేఒక సత్యం మీద ఆధారపడి జరుగుతున్నది. తమ దేశ ఔన్నత్యానికి, గొప్పతనానికి వాళ్ళు ఏం చేశారు? దీని మీద ఆధారపడే చరిత్రలోని వ్యక్తులను గూర్చి నిర్ణయాలు తీసుకోబడుతున్నాయి.

కేథలిక్కులకు విరోధిగా వుండి కనుక ఎలిజబెత్తు రాణి పట్ల నేటి ఏ కేథలిక్కు కూడా ఇంగ్లాండులో అనుకోడు. ఆమె ఇంగ్లాడును గొప్ప దేశంగా చేసింది. అందుకే ఏ మతానికి చెందినవారైనా సరే- ఇంగ్లీషు వారంతా ఏకమై ఆమెను గౌరవిస్తారు.

ఈనాడు ప్రతి ఇంగ్లీషు కేథలిక్కు దృష్టిలోను ఆమె కాదు శత్రువు-స్పెయిను రాజుగు రెండవ ఫిలిప్పు వారికి విరోధి. అతను కేథలిక్కు మతాన్ని రక్షించడంకోసం ఇంగ్లాండు మీద దాడి చేసినా, ఇంగ్లాండులోని కేథలిక్కు మతస్థులను వారి బాధల నుండి రక్షించడానికని ఇంగ్లాండుపై దాడిచేసినా, అతను కేథలిక్కు మతస్థుడైనాసరే - ఇంగ్లాండుపై యుద్ధం చేశాడు, కాబట్టి ఆయన బ్రిటిష్ చరిత్రలో జాతీయ శత్రువు. అందువల్ల ఇంగ్లాండులోని కేథలిక్కులకు కూడా అతను శత్రువే. (అలాగే భారతదేశంలో ఎన్నో దుర్మార్గాలు చేసి దుష్టుడని ఆంగ్లేయులచేతనే అంగీకరించ

బడ్డా వారన్ హేష్టింగ్సు అతని చర్యలవల్ల ఇంగ్లాండుకు మేలు కల్గించాడు కనుక అతన్ని జాతీయవీరుడుగా ఇంగ్లాండు పార్లమెంట్ గౌరవించింది.)

క్రైస్తవుడు కాకుండా 'పేగన్' అయినా 'పెరిక్లస్' వంటి గ్రీకు క్రైస్తవులు గర్వంగా చూస్తారు. కారణం? అతను తమలా క్రైస్తవుడు కాకపోయినా తమవలె గ్రీకు దేశంవాడు. బల్గేరియా రాజులు క్రైస్తవులే అయినప్పటికీ, మధ్య యుగంలో తమతో పోరాడిన క్రైస్తవ రాజులను మతరీత్యా సాటి క్రైస్తవులే అయినా జాతీయ శత్రువులుగా చూస్తారు.

విజ్ఞాన గల దేశభక్తి కల్గివుండడంలో పాశ్చాత్య రాజ్యాలను తలదన్నే తూర్పు ఆసియా రాజ్యం జపాన్. అక్కడ ఒక బౌద్ధ మతస్తుని ఒక విదేశీయు డిలా అడిగాడు: "మీ శత్రువుల నాయకుడుగా బుద్ధ భగవానుడే వస్తే ఏం చేస్తావు?" ఆ జపాన్ బౌద్ధుడు ఆశ్చర్యం కలిగే సమాధానాన్ని ఏమాత్రం సంకోచించకుండా చెప్పాడు: "యుద్ధరంగంలో ఆయనను చంపుతాను." అదీ వారి దేశభక్తి. ఈ అయితే గియితేలను వదలిపెట్టి జపాన్ చరిత్రలో జరిగిన సంఘటనలను చూద్దాం. జపాన్ దేశంలో క్రైస్తవులను తుడిచిపెట్టేటంతగా చిత్రహింసలకు పాల్జేసిన హిడెయోషి, ఇయాసు, ఏమిట్సులను గురించి ఏ జపాను క్రైస్తవునన్నా సరే అడిగితే, వారు తమ జాతీయ వీరులంటారు. ఎవరన్నా వారు క్రైస్తవులను పెట్టిన యమయాతనలను గురించి యెత్తుతే "ఆ కాలంలో దేశం మంచి కోసం అలాంటి చర్యలు (అంటే క్రైస్తవులను యమయాతనలు పెట్టడం) అవసరమైనాయి" అనేదే వాళ్ళ సమాధానం.

పూర్వకాలపు చరిత్రలోని వ్యక్తులను, సత్యాలను ఒక ప్రత్యేకమైన పద్ధతిలో ప్రతీ దేశ పౌరుడూ చూడాలి. ప్రాంత, మత, వర్ణముల కతీతంగా అలా చూడకల్గడమే ఏ జాతి గట్టిదనానికైనా పునాది అవుతుంది.

భారత దేశంలో హిందువులు కానివారు-ముస్లింలు, జొరాష్ట్రియన్లు, క్రైస్తవులు ఇత్యాది- భారత చరిత్రలోని వ్యక్తులను, సత్యాలను ఈ భావంతో చూస్తేనే తప్ప భారతీయులందరికీ ఒకే ఒక చరిత్ర వుండదు. అంటే భారతజాతే వుండదు. వారు భారతదేశంలో నివసించే ముసల్మాను, క్రైస్తవులు, పార్శీలు అనే గుంపులుగా, వర్గాలుగా మాత్రమే వుండిపోతారు. ఇప్పుడున్నట్లుగానే వుంటారుగాని నిజమైన దేశభక్తి కల్గిన భారతీయులుగా వుండలేరు. భావాత్మకత రావాలి (Emotional integrati‿n).

## విద్యలో మార్పు

భారతదేశంలో జాతీయతను పటిష్టం చేయడానికి అన్ని చోట్లా, కనీసం మూలసూత్రాలకు సంబంధించినంత మటుకైనా, ఒకే పద్ధతిలో నిర్బంధ ప్రాథమిక విద్య వుండాలి. గట్టి జాతీయ భావాలు వుంటి వాటి నమలుజరుప శక్తిగలట్టి ప్రభుత్వం అవసరం. పిల్లలకు చక్కని చరిత్ర గ్రంథాలు ఉపయోగించితేనే వారు "భారతీయ" పౌరులుగా తయారవుతారు. అప్పుడే వాళ్ళు "మేము ముందు భారతీయులము. తరువాతనే వైష్ణవులము, ముసల్మానులం, కాళీ ఉపాసకులం, క్రైస్తవులం" అంటూ అనుకోగల్గు తారు. ఈ దేశాన్ని జయించి రాజ్యం చేసిన విదేశీయులు వారు తమ క్రైస్తవ మతం వాళ్లైనాసరే లేదా బౌద్ధం మతం వాళ్లైనాసరే లేదా ముస్లిం మతం వాళ్లైనాసలే- తమకు శత్రువులు అనుకుంటారు.

మనకు స్వతంత్రం వచ్చింది. ముస్లింలు, క్రైస్తవులు, హిందువులు ఈ దేశం ఒకే జాతిగా రూపొందడానికి చరిత్రను, ముస్లిం 'మతం' ఆధారంగా, క్రైస్తవ 'మతం' ఆధారంగా చూడడం మానాలి. చరిత్ర విశ్లేషణ (Analysis) అందరూ ఒకే జాతీయ దృక్పథంతో చేయాలి. **స్వతంత్ర భారతదేశంలో సైన్యానదళం (సైన్యం), విదేశ వ్యవహా**

**రాలు యెంత ముఖ్యమైనవో జాతీయ విద్య కూడా అంత ముఖ్యమైనదే.** విదేశీయులు మనల్ని పరిపాలిస్తున్నప్పుడు భారీ యెత్తున జాతీయ అభ్యున్నతి అసాధ్యంగా వుండేది. కాని యిప్పుడు యేదైనా జరగాలంటే అది కష్టం కాదు. ప్రస్తుతం నిజమైన జాతీయతని మేల్కొల్పడమంటే దేశంలో అనేక వర్గాల నాయకులను, కాబోయే నాయకులను అందరినీ ఒకే జాతీయ ఆదర్శం వైపుకు మళ్ళించడమన్న మాట - మెల్లమెల్లగా ప్రజా బాహుళ్యాన్నంతా మార్చడమన్న మాట.

## సమాన శత్రు, మిత్రత్వ భావాలు

'ఇదివరకు అసలు భారతజాతి అనేదే లేదు' అని కొందరంటున్నారనుకోండి. "అయితే కావచ్చు ఇప్పుడొక దాన్ని సృష్టించండి - రూపొందించండి. భవిష్యత్తులో అభివృద్ధి పొందుతుంది" అని అందాం. బ్రిటన్, ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీలు జాతులుగా వుండనికాలం వుంది. ప్రస్తుతం అవి గొప్ప జాతులుగా వున్నాయి. ఎందువల్ల? ఆ దేశాల ప్రజలు గతంలో వాటిని సృష్టించుకున్నారు. కనుక, రూపొందించుకున్నారు కనుక. కేథలిక్కులుగా, ప్రొటెస్టంటులుగా వాళ్ళలోవున్న విరోధాలకు అతీతంగా వాళ్ళలోవున్న ఒకే దేశస్థులం, ఒకే సంస్కృతిగలవారం ఇత్యాది, సమాసంగావున్న సంబంధ బాంధవ్యాలను వాళ్ళు మనస్ఫూర్తిగా గుర్తించారు.

ఫ్రెంచి కేథలిక్కు ప్రభుత్వాన్ని పడకొట్టడానికి ఇంగ్లండులోని ప్రొటెస్టంటు ప్రభుత్వ సహాయాన్ని అడగడం యెంతమాత్రము సిగ్గుచేటైన విషయం కాదనీ, పైగా అట్లా అడగడం తమ విధి అనీ ఫ్రెంచి దేశంలో ప్రొటెస్టంటులు అనుకున్న రోజులు యిదివరకున్నాయి. ఇంగ్లండులో ప్రొటెస్టంటు ప్రభుత్వంతో పోట్లాడడానికని ఎంతమాత్రం సిగ్గుబిడియాలు లేకుండా కేథలిక్కు స్పెయిన్ ప్రభుత్వానికి మద్దతునిచ్చి,

స్వాగతం పల్కిన కేథలిక్కులు యింగ్లండులోవున్న రోజులు యిదివర కున్నాయి. అలాంటి పరిస్థితులు ఆ దేశాలలో వున్నంతకాలం ఆ జాతులు క్రిందిస్థాయిలోనే వున్నాయి. అయితే యిప్పుడా దేశాలు అలాటి పరిస్థితిని దాటాయి. మనంకూడా అలాంటి పరిస్థితులలో వున్నాం. మనంకూడా అలాంటి పరిస్థితిని దాటాల్సిన సమయం వచ్చింది. మధ్యయుగపు భావాలు వదలి నూతన ప్రపంచ రాజకీయ వాతావరణానికి అనుగుణంగా మనల్ని మనం సరిదిద్దుకోవాలి. బ్రిటిష్ ప్రభుత్వాన్ని 'దేవుడిచ్చిన వరం' అని గొప్పగా పొగిడిన కేశవ చంద్రసేన్ దృష్టితో చూడడం ఈనాడు భారత క్రైస్తవులు, బ్రహ్మ సమాజం మతస్తులు మానాలి. చాలావరకు మానేశారు కూడా. భారత ముస్లింలుకూడా యిదివరకు నుండీ భారతదేశ చరిత్రను చూసే పద్ధతి మార్చుకోవలసిన సమయమిది. మనమంతా ఒక జాతిగా రూపొందాలని కోరుతుంటే 'జాతీయ గౌరవానికి, గొప్పదనానికి లాభమా, నష్టమా?' అనే దృష్టితో కాకుండా మహమ్మదీయ గౌరవానికి, గొప్ప దనానికి లాభమా, నష్టమా అనే గీటురాయితో మన దేశ గత చరిత్రను నిర్ణయించడం ముస్లింలు మానాలి. మన చరిత్రలో అనేక సందర్భాలలో ప్రముఖపాత్ర గలవాళ్ళ మతంతో దీనికెలాటి సంబంధం వుండకూడదు. వాళ్ళు భారతీయులుగానే చూడబడాలి. ఒక్కముక్కలో చెప్పాలంటే-తమ తమ దేశ చరిత్రలను, వ్యక్తులను, సంఘటనలను ఐరోపా దేశాలవారు, జపానువాళ్ళు ఇతర అధునాతనమైన జాతులు చూస్తున్నట్లే భారతీయు లెల్లరూ తమ చరిత్రను చూడాలి. వ్యక్తిగతంగా కేథలిక్కులైన ప్రతి ఆంగ్లేయుడు ఎలిజబెత్తురాణిని ఎలా తమ దేశపు గొప్ప సామ్రాజ్ఞిగా భావించి సగర్వంగా చూసేటట్లుగా ఐరోపీయ నాస్తికుడు యుద్ధకాలం లోనూ శాంతి సమయాల్లోనూ తన దేశాన్ని గొప్పదేశంగా చేసిన తన దేశపు క్రైస్తవవీరుడుని చూసి అభిమానపడ్డట్లుగానే మన దేశంలోను క్రైస్తవులూ, ముస్లింలూ కూడా ప్రవర్తించాలి. ఐరోపా దేశాల్లో ఏ

క్రైస్తవుడైనాసరే తమ దేశంలోని తమ జాతీయ పరంపరలోని నాస్తికులను, క్రైస్తవ వ్యతిరేకులను చూసి వాళ్ళు నా దేశపువాళ్ళు అని గర్వపడుతున్నట్లే క్రైస్తవులను కొరతవేసి శిక్షించిన క్రైస్తవులుకాని జపాను దేశ చరిత్రలోని ఆ దేశపు గొప్పవారిని చూసి క్రైస్తవమతం అనుసరించే జపాను దేశభక్తుడు యెలా గౌరవిస్తున్నాడో, మహమ్మదీయ మతం నాది అనే భారతీయుడుకూడా గురుగోవిందసింగ్, పృథ్వీరాజు, శివాజీ, రాణాప్రతాప్ మొదలగు పూర్వ హిందూవీరుల నందరినీ గౌరవించాలి. భారతీయ సంస్కృతికోసం, భారతీయ ఉన్నతికోసం, భారత స్వాతంత్ర్యం కోసం జీవించి, పోరాడిన మన చరిత్రలోని వారినందరినీ చూసి నా దేశపు గొప్పవీరులు అని మురిసిపోవాలి. నా భారతీయులు అని గర్వించాలి. ఈ వ్యక్తులంతా మతాన్ని గూర్చి ఏమనుకున్నారు? వీళ్ళు ఏ మతం వాళ్ళు? ఈ ప్రశ్నలు అనేవి అప్రస్తుతం. గురుగోవిందసింగ్ సిక్కు కనుక, నేను బౌద్ధుడిని కనుక అతనిని గౌరవించను అనడంగాని, రాణా ప్రతాప్ హిందువు కనుక నేను ముస్లింను కనుక గౌరవించను అనడంకాని లేదా వీళ్ళంతా మా క్రైస్తవులు కాదు కనుక నేను గౌరవించను అనడంకాని జరగ కూడదు. భారతదేశంపై దండెత్తివచ్చిన విదేశీయులతో పోట్లాడుతూ ప్రాణాల నర్పించిన టిప్పు సుల్తాను వంటి వీరులపట్ల హిందువు అందరూ ఇదే మాదిరిగా గర్వంగా ప్రవర్తించాలి.

## ఘోరీ, గజనీలు ఇత్యాదులు జాతీయ విరోధులు

స్పెయిన్ రాజు ఫిలిప్ కేథలిక్ అయినా సరే అతను ఇంగ్లండుకు ప్రతిగా యుద్ధం చేశాడు కనుక ప్రతి యింగ్లీషువాడు (తాను కేథలిక్కు యినా సరే) అతను తనకు శత్రువని యే విధంగా అనుకుంటాడో అలాగే ప్రతి భారత ముస్లింకూడా ఏ కారణంవల్లనైనా సరే- భారతదేశంపై దండెత్తిన మహమ్మదు ఘజనీ, ఘోరీ, బాబర్ అతని సంతతులను శత్రు

వులుగానే చూడాలి. హిందువులపై మాత్రమే దండెత్తిన ఘోరీ, ఘజనీల వంటి శత్రువులపట్లా మహమ్మదీయులు పరిపాలిస్తున్న భారతదేశంపై దండెత్తిన నాదిర్షావంటి శత్రువులపట్లా అతని దృష్టిలో ఎలాటి మార్పూ వుండకూడదు. యూరోపు దేశీయులు మొదట్లో మన దేశానికి వచ్చినప్పుడు మహమ్మదీయుల నెదిరించడంకోసం వారితో చేతులు కలుపవచ్చుననే భ్రమతో హిందువులు గొప్ప పొరపాటు చేశారు.

సుభాస్ బోసు అనుచరులు, ముస్లింలీగులమధ్య జరిగిన ఒప్పందాన్ని హిందూ సభవారు తీవ్రంగా విమర్శించారు. బెంగాలు శాసన సభలో మహమ్మదీయులతోబాటు హిందూ సభ్యులు (కాంగ్రెసు, హిందూ సభల వారు) యెంతమాత్రం కలసి ఓటు చేయరు. అంతేకాదు, ముస్లింలకు ఫార్వర్డు బ్లాక్ (సుభాస్ చంద్రబోసు పార్టీ)కు వ్యతిరేకంగా అప్పుడప్పుడు ఐరోపీయులతో కలిసి ఓటు చేశారు. పార్టీ సంకుచిత ప్రయోజనం దృష్ట్యా యిది ఆనాడు బాగానే వుండొచ్చు. కాని భారత జాతీయత దృష్ట్యా ఇది సవ్యం అనగలమా ?

అలాగే కొందరు ముస్లింలుకూడా హిందువుల నెదుర్కొనడానికి అని అదే పొరపాటు చేశారు.

**హిందువులు కాని, ముస్లింలు కాని, క్రైస్తవులు కాని భారత దేశ శత్రువును తమ శత్రువుగా, భారతదేశ మిత్రుని తమ మిత్రునిగా భావించిన నాడే వీరంతా ఒకే జాతిగా రూపొందుతారు.**

పెద్దవాడైన ప్రతివ్యక్తికీ కొన్ని ప్రత్యేక లక్షణాలున్నట్లే ప్రతి జాతికీ కొన్ని ప్రత్యేక లక్షణాలుంటాయి. అందులో ఆ దేశ పౌరులంతా తమ గత చరిత్రపట్ల చూపే జాతీయతతో కూడిన భావం ఒక ప్రముఖ

లక్షణం. దురాశతో, దురాక్రమణ ప్రవృత్తితో సంచరించే దేశాలతో నిండి వున్న ప్రపంచంలో రాజకీయంగా త్వరలో మనం పటిష్టమైన, బలమైన ఏక జాతిగా రూపొందకపోతే ప్రమాదకరమగు పరిణామాలు వస్తాయి. హిందూ ముస్లిం సమస్య పరిష్కరించడానికికూడా యిది యెంతో అవసరం. మనం ఒక జాతిగా రూపొందకపోతే ముస్లింలు విజృంభించి హిందువులను పూర్తిగా నాశనం చేయడం గాని, హిందువులు విజృంభించి మహమ్మదీయులనందరిని మక్కాకు పంపడంగాని జరగవచ్చు. లేదా వీళ్ళ పోట్లాటల ఆధారంగా బలంగల యితర ప్రపంచ జాతులు మన జాతీయ జీవనాన్ని శాశ్వతంగా తమ గుప్పిట్లో బిగించెయ్యవచ్చు. అందువల్ల భారత ముస్లింలు, క్రైస్తవులు అభివృద్ధి చెందిన జాతులవలె ఆలోచించి జాతీయ అనుభూతులతో మసలుకోవడం ఎంతైనా అవసరం. అప్పుడు హిందువుల్లో, ముస్లింల్లో, క్రైస్తవుల్లో నిజమైన జాతీయ చైతన్యం వెల్లి విరుస్తుంది.

## జాతీయ ప్రతిక్రియాత్మక

నేటి ప్రపంచ చరిత్ర తెలుసుకోగల తాజా వార్తల సహాయంతో మనకి ఆంగ్లేయులు నేర్పిన విద్య ప్రభావంవల్ల హిందువులు గాని, హైందవేతరులుగాని సక్రమ రాజకీయ శిక్షణ పొందలేకపోతున్నారనేది అందరికీ తెల్సిన సత్యం. అందుకే అతర్జాతీయత సహజంగా దేశం వుండాల్సిన అంతస్థులో లేదు. ప్రస్తుతం మనం ప్రతిక్రియాత్మక శక్తిని కల్గివుండకపోయినా ఒక వేళ ప్రతిక్రియకే దిగాల్సివస్తే అదెలా వుండాలో కూడా ఒక నిశ్చితమైన పునాదిమీద ఆధారపడిన అభిప్రాయాన్నైనా మనం కల్గివుండలేదు.

మనకు భారత దేశ శ్రేయస్సు ఏదిగా అవుపిస్తుందో దానినిబట్టే మన ప్రతిక్రియను నిర్ణయిస్తే హిందువుల నిర్ణయం, ముస్లింల నిర్ణయం,

క్రైస్తవుల నిర్ణయం వేరువేరుగావున్నా అవి సరైనదారిలోనే నడుస్తాయి. దేశానికి మేలునే చేకూరుస్తాయి. అయితే అదీ చెయ్యడం లేదు మనం. బహుశా ఏకొద్దిమంది హిందువులు, ముస్లింలు చేస్తున్నారేమో-అంతే.

**అంతర్జాతీయ ప్రాముఖ్యంగల ఏ సంఘటనకైనా హిందువు లలో అధిక సంఖ్యాకులు "జాతీయ ప్రతిక్రియ" చూపలేదు. ముస్లిం లలో అధిక సంఖ్యాకులు ముస్లిం మతస్థులుగానే ప్రతిక్రియకు పూను కుండారుగాని భారతీయులుగా కాదు. అలాగే యితర్లుగూడా.**

మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత సెవరస్ సంధిని తిరగతోడా లని భారతదేశంలో భారీయెత్తున ప్రచారం జరిగింది. హిందూ - ముస్లిం ఐక్యత అనే అంతిమ ఆశయం కోసం కాంగ్రెసులోని హిందువులు ఆ ప్రచారంలో ముస్లింలతో కలిశారు. మహ్మదీయులకు కొన్ని అవకాశాలివ్వడం ద్వారా తాముకూడా కొన్ని సదుపాయాలు వారినుండి పొందవచ్చునని అలా చేసి వుంటారు. సెవరస్ సంధి విషయానికి సంబంధించినంతమటుకు అది యెంతమాత్రం జాతీయమైన చర్యకాదు. అంటే, ఆ సంధి విషయంలో ఒక జాతిగా మనం చూపాల్సిన ప్రతిక్రియ (reaction) అలా వుండకూడదు. ముస్లింల వైఖరి ఈ విషయాన్ని స్పష్టం చేసింది.

**టర్కీలో ఖిలాఫత్ నిర్వహింపబడుతోందా లేదా అనేది భారతదేశానికెందుకు? టర్కీ ప్రజలు కానట్టివారు కొందరు నివసించే టర్కీ ప్రాంతాలను ఆదేశం కోల్పోతే భారత విదేశ విధానంలో భేదం ఎందుకు రావాలి?** టర్కీకి అన్యాయం జరిగిందనుకొని టర్కీ తరఫున భారత ముస్లింలు నిలుస్తే-మరి సెవరస్ సంధిని వ్యతిరేకించినంత తీవ్రంగా నొల్లులీ, వెర్సైల్సు సంధుల నెందుకు వ్యతిరేకించలేదు? బల్గేరియా జర్మనీలు కూడా కొన్ని భూభాగాలు పోగొట్టుకున్నాయి. అవి టర్కీలో

మాదిరిగా యితర జనాభా మాత్రమేగల ప్రాంతాలుకావుకూడా. టర్కీవలె అవి ముస్లిం రాజ్యాలు కాకపోవడంవల్లనే మన ముస్లింలు, మనం వాటికి అన్యాయం జరిగినా నోరెత్తలేదు. తూర్పుగ్రీసు ఆశియా మైనర్లలో కొంత పోగొట్టుకున్న టర్కీమాదిరిగా రోబ్రుడాజా, సుడేటోలను పోగొట్టుకున్న బల్గేరియా, జర్మనీ సంఘులు కాంగ్రెస్ (లోని హిందువుల) కంత వ్యతిరేకులుకావు. అంటే ముస్లిం దేశమైన టర్కీ విషయంలో ఈ జాతి శ్రేయస్సుకన్న, యిక్కడి ముస్లింలు వారిని బుజ్జగించి హిందువులు కూడా యితర విషయాలకు ప్రాధాన్యత నిచ్చారన్నమాట!

ఇలా తేలికగా యితర సందర్భాలను, సంగతులను ఎన్నో వేలు పెట్టి చూపవచ్చు. మన దేశ శ్రేయస్సుతో ఎలాంటి సంబంధం లేని విదేశాల్లోని సంఘటనలపట్లా విదేశాలపట్లా వారి వ్యవహారాలు, యిత్యాదులపట్లా అవి మనకు అంత ప్రధానమైనది కాకపోయినా హిందువులు తమ వైఖరిని ప్రకటిస్తారు. వాటి విషయంలో అనవసరంగా వేలు పెడతారు. ఇలాంటి సందర్భాలలో జాతీయ శ్రేయస్సు విషయం ఆలోచించరుకూడా.

## స్వార్థం మూలకారణం

వ్యక్తిగతంగా హిందువులు చెప్పేది, చేసేది ఏదైనప్పటికీ అది సర్వసాధారణంగా వర్గ సంబంధపు, చివరకు (వ్యక్తి లేదా పార్టీ) స్వార్థపూరిత ప్రయోజనాల కోసమే అనిపిస్తోంది. విదేశ రాజకీయాలపట్ల ప్రతి ఒక్కరి (ప్రతిఒక్క పార్టీయొక్క)అభిమానాలు, ఆఖరికి దురభిమానాలుకూడా ఇదే పంథాలో వుంటాయి.

ఒక వ్యక్తికి తన వ్యక్తిగత వాంఛలు ప్రయోజనాలు (వ్యాపార రీత్యా రానివ్వండి, మరేరకంగానైనా) జపాన్ అభివృద్ధి చెందడం మీద

ఆధారపడివున్నాయనుకోండి. అతను జపాన్ శ్రేయస్సు కోరుతూవుంటాడు. మరొక వ్యక్తికి అమెరికాతో లేదా ఇంగ్లండుతో వారివల్లహొందే లాభాల ననుసరించి సన్నిహితత్వం వుంటుంది. అంతేకాని జపాన్, ఇంగ్లండు లేదా అమెరికాలు భారతదేశానికి అతి సన్నిహితమైన మంచి స్నేహితులు కావడం వల్ల కాదు.

**హిందువులలో చాలమంది విపరీతంగా స్వార్థపరులు కావడం వల్లనే (స్వార్థంవల్ల అనైకమత్యంతో వుండడంవల్లనే) ముస్లింల (క్రైస్తవుల) వైఖరి భారతీయతకు దగ్గరగా రాలేకపోతున్నది.** కనుక వర్ణ వర్గ విద్వేషాంతో వైషమ్యాలతో నిండివున్న స్వార్థపరు **లగు హిందువులందరూ తమ ప్రయోజనాలను భారతదేశం అంతటికీ** విస్తృతం చేయాలి.అలాగే ముస్లిం మనస్తత్వం-పాక్ ఇస్లామిక్ తత్వంగల భారతముస్లింలు మొదట తమ ప్రయోజనాలను హిందూదేశానికే పరిమితం చేయాలి. వ్యక్తులకంటె భారతదేశమే ముందు. **వర్ణ, వర్గాలకుముందు భారతీయత సమానంగాగల ఒకే మతం లేక 'ఇజం' సాంఘికతత్త్వం ఇంక మరేమైనా సరే అవి ప్రపంచ పరివ్యాప్తములైనాసరే (అంటె అంతర్జాతీయ ఉద్యమాలైన కమ్యూనిజం, పాక్ ఇస్లాం, క్రైస్తవ క్రిసిండం వంటివి) వాటికంటె ప్రప్రధానమైనది భారతీయత. ఇది మనకు అతి ముఖ్యమైన విషయం బలవంతంగానైనాసరే ………**

ప్రచారంవల్లగాని, బలప్రయోగంవల్లగాని, **భారతీయులలో అత్యధిక సంఖ్యాకుల దృక్పథంగా ఇదివస్తే తప్ప భారతజాతి పటిష్ఠంగా రూపొందే ఆస్కారం వుండదు.**

ప్రత్యేకంగా 'పాక్ ఇస్లాం' అనేదాన్ని మనం అది ఇస్లాం మతంకి సంబంధించిందికనుక దూషించమని మన మహమ్మదీయ సోదరులకు బాగా

తెల్సు. ఇతర అంతర్జాతీయతత్త్వాలను (కమ్యూనిస్టు వగైరా)నిరసించినట్లే, వ్యతిరేకించినట్లే మనం దాన్ని వ్యతిరేకిస్తాం. **ఈ అంతర్జాతీయ ఉద్యమాలు(అంటే పాక్ ఇస్లాం, కమ్యూనిష్టు వగైరాలు) వ్యక్తిని భారత దేశ శ్రేయస్సును గీటురాయిగా కాక ఇంకో దృష్టితో జాతీయ అంతర్జాతీయ వ్యవహారాలను నిర్ణయించడానికి పురికొల్పుతాయి.** ఇలాగే హిందూత్వ అంతర్జాతీయ ఉద్యమంలాగా ప్రపంచ దేశాల్లో పాక్ హిందూ సామ్రాజ్యం లేదా అంతర్జాతీయ కమ్యూనిజం వలె అంతర్జాతీయ హిందూ "ఇజం" పేరుతో రాజకీయంగా లేదా అన్యధా పోదలిస్తే మనమే దానిని హర్షించం. **అయితే హిందూత్వం ఏ ఒక్క ప్రత్యేక మతంతోగాని తాదాత్మ్యం పొందివున్నట్లు పరిగణింపబడకూడనిది.** (అది ఒక రాష్ట్రీయత లేదా జాతీయత) నిజానికి ఒక ప్రత్యేక మత, రాజకీయ ఆశయం లేదా వర్గం ఆధారంగా ఏ జాతి చిరకాలం జీవించలేదు. కాలం మారుతూ వుంటుంది. దానితోబాటు జాతి అవసరాలు కూడా మారుతాయి. దాని కనుగుణ్యంగా సంస్కృతి వికసిస్తూ వుంటుంది. కనుక ఏ మతం వాడైనా (ఆ మతం రాజకీయంగా కూడా వ్యాపించివున్నదైనాసరే) వెంటనే తనకు ఆ మతం కావాలా, జాతి కావాలా అన్నదాన్ని తేల్చుకోవాలి. తన మత మేదైనాసరే హిందూదేశాన్నే - భారతదేశాన్నే అంతకంటే మిన్నగా ఎన్నుకోవాలి. ప్రతి భారతీయుని మనం కోరే ఒకే ఒక కోరిక ఇదే.

జై హింద్ !

# ఉపసంహారం

జాతీయ సమైక్యతను గురించి మాట్లాడే వాళ్ళంతా ముందు స్పష్టంగా గుర్తించాల్సిన విషయం ఒకటి వుంది. ఈనాటికీ నూటికి 85 మంది గల హిందువుల మీదనే ఈ దేశ భవిష్యత్తు, ఈ జాతి భవిష్యత్తు ఆధారపడి వుంది. హిందువులు అకర్మణ్యులుగావుండి తమ పాత్రను సముచితమైన రీతిలో నిర్వర్తించకుండా "గుదిబండ" లాగా వుంటే కేవలం నూటికి 15 మంది గల ముస్లింలు, క్రైస్తవులు అనబడే "మైనారిటీలు" ఈ దేశాన్ని, ఈ జాతిని ఒక్క అంగుళం కూడా ముందుకు తీసుకువెళ్ళలేరనే కఠిన సత్యాన్ని హిందువులు గుర్తించాలి. అదే విధంగా 85 శాతం జనాభాగల హిందువులు తమలోగల ఆంతరంగిక సమైక్యతా సూత్రాన్ని గుర్తించి, తమలోగల వికృతులను పారద్రోలి, బలవంతులై శీలసంపన్నులై భావాత్మకమైన హిందువులుగా జీవనం కొనసాగిస్తూ ఈ దేశాన్ని ఈ జాతిని ముందుకు తీసుకువెళ్ళడానికి ఉద్యమిస్తే 15 శాతం గల ముస్లింలు, క్రైస్తవులు కలిసి రాకపోయినా, ప్రతిఘటించినా ఈ దేశప్రగతిని జాతిప్రగతిని, అడ్డగించలేరు.

అనేక జాతులుగల దేశమని విశ్వసించిన కమ్యూనిస్టు నాయకుడు, కేరళ మాజీ ముఖ్యమంత్రి అయిన అచ్యుతమీనన్ కూడా చివరకు ఈ దేశంలో ఒకటే జాతి వుందని, దానికి మూలం హిందూ సాంస్కృతిక విలువ లేనని అంగీకరించారు. కనుక మన జాతి ప్రతిక్రియాత్మక భావాలమీదను, లేదా వ్యతిరేకాత్మక భావనలవల్లను, సంకరజాతీయవాదంవల్లను, ప్రాదేశిక వాదం మీదను గాక స్వాభిమానపూరితంగా "ఇది నా మాతృభూమి" అనే నిష్ఠాత్మకమైన దేశభక్తి భావనగలవారే ఈ జాతీయులు అన్న గుర్తింపు వుండాలి.

బలహీనులుగావుండి హిందువులు ఎంత స్నేహభావంతో ఆత్మీయతా భావంతో బుజ్జగింపు ధోరణిలో ముస్లింలను, క్రైస్తవులను దగ్గరకు తీసుకుందామని ప్రయత్నించినా వారు దగ్గరకు రాకపోవడమేగాక మరింత దూరమవుతారు. హిందూ సమాజం బలవత్తరంగావుంటే వారి స్నేహహస్తాన్ని కాదంటే ఇచ్చట తమ మనుగడకే ప్రమాదమని గుర్తించి తాము సమాజంతో తాదాత్మ్యం చెందుతారు. "హైదరీస్తాన్"లు "పాకిస్తాన్"లు కావాలంటూ రోజురోజు హిందువుల బలహీనత నాధారంచేసుకుని ప్రగల్భాలు పలుకుతూ "అందితే జుట్టు,అందకపోతే కాళ్లు" అనేమనస్తత్వంగల వేర్పాటు ధోరణుల ప్రభావితులైన ముస్లింలకు! క్రైస్తవులకు అర్థమయ్యే భాష బలం ఒకటే, "హిందూ సమాజ సంఘటన"దేశభక్తి నాకు వుంది అని చెప్పుకునే ప్రతి హిందువుకు ఈ కార్యంవల్లనే ప్రధాన కర్తవ్యం కావాలి. నియోగి కమిటీ, రేగేకమిటీలు క్రైస్తవ మిషనరీలపై యిచ్చిన రిపోర్టులను అమలు జరపాలని ప్రభుత్వంపై ఒత్తిడి చేయాలి.

అలాగే వేర్పాటు ధోరణులకులోనుగాని ముస్లింలు శ్రీ చాగ్లా, హమీద్ దల్‌వాయీ వంటి వారిని ఆదర్శంగా పెట్టుకుని తమను హిందూ సమాజానికి దూరంచేస్తున్న ఆలోచనా విధానాలకు దూరం కావాలి. చిన్న గోవా ప్రాంతంలో హిందూ ముస్లిం క్రైస్తవులందరికీ ఒకే చట్టాలున్నట్టు యావద్దేశంలోనూ అందరికీ ఒకే చట్టం వుండడంలో బేసబబు లేదని గ్రహించాలి. తాము హిందూ సంతతికి చెందినవారేగనుక హిందువుల శత్రువులైన బాబరు ఘజనీ, ఘోరీలు తమకు కూడా శత్రువులేనని గుర్తించాలి. సమగ్రమైన విద్య ద్వారా దీనిని సాధించడం కష్టం కాదు. హైదరాలీ, టిప్పు సుల్తాన్‌లు మహమ్మదీయ మతస్థులైనా యేవిధంగా శృంగేరీ శంకరాచార్యను గౌరవించారో, ఏ విధంగా హిందువుల మానబిందువులపట్ల గౌరవంగా ప్రవర్తించారో ఆ విధంగా నేటి ముస్లిం, క్రైస్తవులు ప్రవర్తించడం నేర్చు

కోవాలి. పేర్లు, అలవాట్లు, సాంప్రదాయాలు వగైరా ఇస్లాం అనుసరించే అరబ్బీలవో లేదా ఇరానీలవోగాక భారతీయమైనవిగా రూపొందించు కోవాలి. అరేబియాలో లెగతైన షేక్, సయ్యద్ అని పేర్లు పెట్టు కొనడం మానాలి. ప్రతి చిన్న విషయంలోనూ హిందూ సమాజాన్ని అవమానపరిచే, దూషించే ప్రవృత్తిని విడనాడి, 'ఈ హిందువులు, మేమూ ఒకే కుదురుకు చెందుతాము. మేమందరము భరతమాత పుత్రులము కనుక అన్నదమ్ములం. విదేశస్థులెవరైనా కేవలం మా ఇస్లాం లేదా మా క్రైస్తవ మతం అనుసరిస్తున్నారు' కనుక వారు మాకు తోటి హిందూ సోదరులకన్నా సన్నిహితులు కారు అని ప్రకటించాలి. ఒక్క మాటలో చెప్పాలంటే ముస్లింల, క్రైస్తవుల మనస్తత్వం మారాలి. మారి తీరాలి. మార్చాలి. జబ్బుపడ్డ పుత్రుడు మందు వద్దన్నా ప్రేమతో తల్లి బలవంతంగా మందు త్రాగించినట్లు అవసరమైతే బలవంతంగానైనాసరే మార్చితీరాలి. పాకిస్తాన్ క్రికెట్ మ్యాచ్‌లో లేదా హాకీలోనో గెల్చిందని రేడియో లో చెప్పగానే రేడియో కు పూలదండలు వేసి పాకిస్తాన్ జిందాబాద్ అని అరిచే ముస్లిం మన దేశంలో నివసిస్తున్నా అతను దేశద్రోహనని గుర్తించాలి. చైనానో రష్యానో ఆరాధిస్తూ వారిని ఆహ్వానించడానికి సిద్ధపడేటట్టే, వారి ప్రయో జనాల కోసం యీ దేశంలో అవసరమైన చర్యలు చేపట్టే కమ్యూనిష్టు హిందువైనా ఎలా దేశద్రోహో అలాగే వీరూ దేశద్రోహులే. ప్రపంచంలో యితర దేశాలలోకి విస్తరించినప్పుడు మన దేశంలోని ముస్లింలవలె, క్రైస్తవులవలె ఆ దేశపు వేషభాషలను, జీవన విధానాన్ని, సంస్కృతిని, ప్రాచీన వీరులను, పరంపరను ఆచార వ్యవహారాదులను మార్చుకోలేదనే సత్యాన్ని ముస్లింలు, క్రైస్తవులు గుర్తించాలి. మన దేశంలో ముస్లింలు, క్రైస్తవులు తమ ఆలోచనా ధోరణుల సైతం మార్చుకున్నారు. ఈ ఆలోచనా ధోరణులు మార్చుకొనకపోతే వారు జాతీయ జీవస్రవంతికి దూరం అయివుండేవారు కాదు. ఇస్లాంను వివేకాత్మకంగా అనుసరించుతూ

తమ మాతృ సమాజమైన హిందూ సమాజానికి సన్నిహితులయ్యేవారు. అమెరికాకు వెళ్ళి, రష్యా వెళ్ళి రష్యన్ పౌరసత్వం స్వీకరించిన ఏ దేశస్తుడైనా రష్యా జాతీయ వీరులైన లెనిన్ వంటివారిని జాతీయ వీరులుగా అంగీకరించకపోతే వారిని ఆ జాతీయులుగా ఎలా పరిగణించరో అదేవిధంగా ఈ దేశపు జాతీయ వీరులను గౌరవించని ముస్లింలు, క్రైస్తవులు కూడా ఈ జాతీయులుగా పరిగణింపబడరని వారు గుర్తించాలి. ఒక్క మతం-అంటే దేవుని తమ యిష్టమొచ్చిన రీతిలో ఆరాధించే విషయం మినహా జీవితంలో అన్ని యితర రంగాలలోను ముస్లింలు, క్రైస్తవులు హిందువులలాగా జీవించడం నేర్చుకోవాలి- వారంతా ఒక జాతీయ ప్రవాహంలోని వారే కనుక. ఎనిమిది వందల సంవత్సరాలు విదేశాల నుండి వచ్చి ఈ దేశాన్ని హిందూ సమాజాన్ని పరిపాలించిన విదేశీ ముస్లిం రాజులైన బాబరు వగైరాల వారసులమని ముస్లింలు, రెండు వందల సంవత్సరాలు మనని పరిపాలించిన క్రైస్తవులైన ఆంగ్లేయుల వారసులమని క్రైస్తవులు భావించుకొనడం మానెయ్యాలి. 1947లో ఏర్పడిన పాకిస్తాన్, పాకిస్తాన్‌గా యేర్పడ్డ ప్రాంతాల గత చరిత్రను తమదిగా అంగీకరించి "5000 సంవత్సరాల పాకిస్తాన్ చరిత్ర" అనే గ్రంథాన్ని ప్రకటించి, వ్యాకరణ వేత్త పాణిని యొక్క 5000 జన్మదినం జరుపగా లేనిది ఇచ్చటి ముస్లింలు క్రైస్తవులు ఈ దేశపు చరిత్రను వేద కాలం నుండి నేటివరకూ గల చరిత్రను తమదిగా ఎందుకు భావించరు? హిందువులు గౌరవించే గోవధను ముస్లింలు మానాలి. సంకుచితత్వం విడనాడి హిందువుల సామాజిక పండుగల్లో పాల్గొనాలి. భారీయెత్తు విద్యాప్రచారాల ద్వారా, సక్రమమైన చరిత్ర బోధించడం ద్వారా శివాజి వంటివారు తమ దేశాన్ని విదేశీయుల నుండి విముక్తి కొరకు పోరాడిన జాతీయ వీరులని, అఫ్జల్ ఖాన్, సిద్ధీ వంటివారు ముస్లింలైనా విదేశీ దురాక్రమణదారులని ముస్లింలు గుర్తించాలి.

తాము హిందువులు ఒక జాతివారు, ఒక దేశంవారు ఒకే సంతతి వారు కనుక హిందువులకు లేనట్టి ఎలాంటి ప్రత్యేక హక్కులు "మైనారిటీల" పేరుతో కోరడం అంటే మన సమాజాన్ని, జాతిని చీల్చడమే. రాజకీయవాదుల కుతంత్రాలకు బలియై "ప్రత్యేకతల" పేరుతో హిందూ సమాజానికి దూరం కాకూడదనే దృఢమైన భావం కల్గివుండడం ద్వారా మాత్రమే ముస్లింలుగాని క్రైస్తవులుగాని హిందువుల ప్రేమాభిమానాలను పొందగల్గుతారనే సత్యాన్ని వారు గుర్తించాలి. యిలా ఎన్నో చెప్పవచ్చు. హిందూ దేశాన్ని క్రైస్తవ రాజ్యంగా మార్చాలని చూసే విదేశీ మిషనరీలు తమ శత్రువులని హిందూ క్రిస్టియన్లు ధైర్యంగా చాటాలి.

అయితే ఇవన్నీ సాధ్యమేనా? అని సహజంగా అనిపిస్తుంది- ముఖ్యంగా ప్రస్తుతం వున్న పరిస్థితులలో. ఒక మహాత్ముడన్నట్లు అసాధ్యం అనునది మానవుని పదకోశంలో లేని శబ్దం. కృషి ముఖ్యం. కృషితో నాస్తి దుర్భిక్షం అన్నారు గదా! ముస్లింలు, క్రైస్తవులు వారి వారి వంతు కృషి చేసినా చేయకపోయినా ౮౫ శాతంవున్న హిందువులు తమ బాధ్యతను నిర్వర్తించడంలో తమ వంతు కృషిగా హిందూ సమాజ సంఘటనకై కృషి ప్రారంభిస్తే మిగతా సమస్యలన్నీ "హిందూ సమాజ బలహీనతల" వల్ల యేర్పడినవే కనుక వాటంతటవే పరిష్కరించబడతాయనేది సత్యం.



